బాలానంద

# బొమ్మల భాగవతం



రచన:

పురాణపండ రంగనాథ్



నవరత్న బుక్ సెంటర్

ఏలూరు రోడ్, విజయవాడ - 2.

బాలానంద

# బొమ్మల భాగవతం


రచన :

పురాణపండ రంగనాథ్



ప్రథమ ముద్రణ :

జనవరి-1999





ప్రచురణ హక్కులు :

బి. కె. ఆర్. మూర్తి
విజయవాడ-2.
ఫోన్ : 432813

ముఖచిత్రంలోపలిబొమ్మలు :

త్రిగుణ్

ముద్రణ :

శ్రీరామా ప్రింటర్స్
విజయవాడ-2.

వెల : రు. 25-00

నాన్నగారు అందించిన
ఆధ్యాత్మిక వారసత్వానికి
ప్రతినిధిగా నిలిచి,
మమ్మల్నింత వాళ్ళను చేసిన
భాగవత దీక్షామూర్తి మా అన్నయ్య
శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తికి
ఇది అంకితం చేస్తున్నాను.

— రంగనాథ్

# పన్నెండు స్కంధాల కథాక్రమం

| | | |
|---|---|---|
| 1. భక్తివేదాంత రసాలం | 2. పురాణ తిలకం | 3. పరీక్షిత్తు |
| 4. శృంగి శాపం | 5. భాగవత సప్తాహం | 6. అవతారాలు |
| 7. విశ్వవిరాట్ | 8. సృష్టి-వికాసం | 9. పదిరకాల సృష్టులు |
| 10. కాలగణన | 11. వరాహమూర్తి | 12. జయవిజయులు |
| 13. నూరేళ్ళ గర్భం | 14. కపిలుడు | 15. హిరణ్యకశిపుడు |
| 16. బ్రహ్మవరాలు | 17. ప్రహ్లాదుడు | 18. నరసింహుడు |
| 19. ఆరుగురు మనువులు | 20. గజేంద్రుని వైభవం | 21. దుర్వాసుని శాపం |
| 22. సాగర మథనం | 23. కూర్మావతారం | 24. జగన్మోహిని |
| 25. వైవస్వతమన్వంతరం | 27. మృత సంజీవని | 27. అమ్మ ఆవేదన |
| 28. వామనుడు | 29. ఇంతింతై వటుడింతై | 30. మత్స్యావతారం |
| 31. అంబరీషుడు | 32. పరశురాముడు | 33. శ్రీరాముడు |
| 34. కృష్ణుడి కథ | 35. కంసుడి దౌష్ట్యం | 36. దేవకి పొత్తిళ్ళలో దేవదేవుడు |
| 37. పూతన | 38. సుడిగాలిలో రాక్షసులు | |
| 39 నల్లదొంగ | 40. కృష్ణయ్య నోటిలో మూడు లోకాలు | 41. మొలత్రాడుకు రోజు |
| 42. బృందావనంలో | | 43. మరో ఇద్దరికి శాస్త్రి |
| 44. కాళీయ మర్ధనం | 45. మునికాంతలమురిపెం | 46. ఇంద్రుని ఆగ్రహం |
| 47. వేణుగానం | 48. కంసుని పన్నాగం | 49. ధనుర్యాగం |
| 50. నిన్నకుజ-నేడుసుందరి | 51. కుబ్జపై కృపాదృష్టి | 52. కువలయా పీడం |
| 53. మల్ల యుద్ధం | 54. కంసవధ | 55. సాందీపని |
| 56. జరాసంధ పరాభవం | 57. రుక్మిణీ కళ్యాణం | 58. సత్యభామ |
| 59. నరకాసుర సంహారం | 60. ఉష-అనిరుద్ధుడు | 61. కృష్ణలీలా వైభవం |
| 62. కుచేలుడు | 63. మునుల శాపం | 64. యుగధర్మాలు |
| 65. కల్కి | | |

# బాలానంద బొమ్మల

# భాగవతం

నిగమ కల్పతరోర్గళితం ఫలం శుకముఖా దమృత ద్రవసమ్మితమ్ !

పిబత భాగవతం రసమాలయం ముహురహో రసికా భువిభావుకాః !

ఆది సరస్వతీ నదీతీరం. వ్యాస మునిచంద్రుని పవిత్రాశ్రమం. అక్కడ జైమిని, పైల, సుమంత, వైశంపాయనాది శిష్యులు ధర్మశాస్త్ర మీమాంస చేస్తున్నారు. లోకవృత్త సమీక్ష చేస్తున్నారు. సృష్టి, స్థితి, లయాత్మకమయిన ఈ జగత్తు యొక్క లీలా విశేషాలు, పదార్థ పరమార్థ తత్త్వ వివేచనాలు వారి గోష్ఠిలో సాగిపోతున్నాయి.

వారికి అక్షరభిక్ష పెట్టిన గురుదేవులు ఆచార్య వ్యాసులు మాత్రం అన్యమనస్కంగా ఉన్నారు. ప్రతిరోజువారి చర్చలలో వాగ్వివాదాలలో, పాల్గొని వారి బుద్ధికి అందని తాత్త్విక రహస్యాలు విశదీకరించే ఆ మహర్షి యీనాడు చింతాక్రాంతులై ఉండడం వారికి ఆశ్చర్యవ్యథ కలిగించింది.

అయినా ఆయన ఏకాంత మౌన సమాధిని భంగపరచడం యిష్టంలేక శిష్యులు తమ చర్చలలో నిమగ్నులయారు.

అంతలో అక్కడకు దేవరుషి నారదుడు వచ్చాడు. వైశంపాయనాదులు ఆయనకు అర్ఘ్యపాద్యాలు యిచ్చి ఉచితాసనంపై కూర్చుండబెట్టారు.

## భక్తి వేదాంత రసాలం

పరమ విష్ణు భక్తుడయిన నారదుడు. అక్షర తపస్వి కృష్ణద్వైపాయనుడు ఎదురెదురుగా ఉన్నారు. క్షణంసేపు ఇరువురిలో మహామౌనం తాండవిం

చింది. ఒకరి నేత్రాలలో జిజ్ఞాస. అవి నారదుని చూపులు. మరొకరి కండ్లోయిలో అసంతృప్తి చేతన. అది వ్యాసుని దృష్టి ప్రసారం. నారదుడే వ్యాసుని విచారానికి కారణమేమిటని ప్రశ్నించాడు. అప్పుడు వ్యాసుడు యిలా అన్నాను.

"దేవర్షి! సరస్వతీ కటాక్షంచేత రాశీభూతంగా ఉన్న వేద సముచ్చయాన్ని విభాగించి నాలుగు వేదాలుగా లోకానికి అందించగలిగాను. విజ్ఞాన సర్వస్వమయిన మహాభారతాన్ని రచించి తపస్వులకు నివేదనం చేశాను. శ్రీరామ తత్వాన్ని విశ్లేషించి ఆధ్యాత్మ రామాయణాన్ని వివరించే పద్దెనిమిది పురాణాలు వెలయించాను. ఇంక వాఙ్మయం సృష్టించినా నాలో తృప్తి కలుగలేదు. నాకు శాంతి లభించలేదు. నా సాహిత్య పిపాస తీరలేదు. ఏం చేస్తే నా అక్షర తపో సాధన సార్థకం అవుతుంది?"

వ్యాసుని మాటలు విన్న నారద మహర్షి మందహాసం చేసి యిలా అన్నాడు.

"కృష్ణద్వైపాయనా! శ్రుతివిహితమయిన రీతిలో సంచరించే ప్రాజ్ఞులకు మాత్రమే వేదం అందిస్తుంది. అసాధారణ ధీమంతులు మాత్రమే మహాభారతాన్ని ధారణ చేయగలరు. వేదాంత మనస్కులు మాత్రమే ఆధ్యాత్మక రామాయణామృతాన్ని గ్రోలెదరు. ఇక పురాణాలంటావా అవి అక్షయ విషయ సంభవితాలు. కనుక సామాన్యులు వాటిలో ప్రవేశించలేరు. అంత మాత్రం చేత నీ అక్షర తపస్సు వృథా అయినదని అర్థం కాదు. ఆ చంద్రతారార్కం అవి సాహితీ పథగాములకు ప్రాతఃస్మరణీయాలే అవుతాయి. కాని సామాన్య జనులు సులభంగా తరించడానికి జ్ఞాన వేదాంత భావాల్ని అవగతం చేసుకొనడానికి ఉపయుక్తమయిన మహాభాగవతాన్ని వ్రాయి. అది భక్తి వేదాంత రసాలమై అందరికీ ఉపకరిస్తుంది. నీకు చిత్తశాంతి లభిస్తుంది."

ఈ విధంగా నారద మహర్షి వ్యాసునకు హితవు చెప్పి వెళ్ళిపోయాడు.



వ్యాసునికి నారదుని ఉపదేశం

వ్యాసుడు ఒక శుభముహూర్తాన భాగవతం రచించాడు. దానిని తన కుమా
యిన శుకమహర్షికి వినిపించాడు. శుకుడు కాలాంతరంలో పాండవుల మను
యిన పరీక్షిత్తుకు భాగవతాన్ని యేడు రోజులలో వినిపించాడు. పరీక్షిత్తు
చాడు.

సంస్కృత మహాభాగవతం పన్నెండు స్కంధాలుగా విభాగి
అయింది. మొదటి తొమ్మిది స్కంధాలలో సృష్టి వివరం, కాలవివరణ దశా
రాలు వస్తాయి. పదవ స్కంధం కృష్ణలీలా రహస్యాన్ని తేటతెల్లం చేసుకో
పదకొండు. పన్నెండు స్కంధాలలో యదువంశ నాశనం కలియుగ ధరా
యితరాలయిన అనేక విశేషాల వర్ణితమైనాయి. ఇలా మొత్తం భాగవ
పద్దెనిమిది వేల శ్లోకాలతో విరాజిల్లింది.

మహాభాగవతం ఉపాసకులకు భక్తితత్వ కోశాగారం. అంతేక
భక్తి, జ్ఞాన వైరాగ్యాల త్రివేణి సంగమం దీనిలో ఇరవై నాలుగు అవతా
కథలున్నాయి. వేదాంత వివరాలున్నాయి. భక్తుల దివ్య చరిత్రలున్నాయి
స్కంధంలో యేవేవి వస్తాయో సంగ్రహంగా తెలుసుకుందాం.

ప్రథమ (మొదటి) స్కంధంలో యీ ప్రపంచం యొక్క ఉత్
ప్రళయస్థానాలు నిర్గుణ పరబ్రహ్మ సాక్షాత్కారానికై చేసే జ్ఞానార్జన భక్తిమో
వివరించబడినాయి. పరీక్షిత్తు కథ యిందులో వస్తుంది. శుక పరీక్షిత్తుల సంవా
దీనిలో వర్ణితమైంది.

ద్వితీయ (రెండవ) స్కంధంలో యోగధారణ, ఊర్ధ్వలోకప్రా
నారదబ్రహ్మ సంవాదం సృష్టిక్రమం వర్ణితమైనాయి.

తృతీయ (మూడవ) స్కంధంలో ప్రళయవేళ పరమాత్మ స్వరూ
స్థూల, సూక్ష్మ సృష్టుల విస్తరణ, వరహావతారం, జయవిజయుల కథ హిరణ్యా
హిరణ్యకశిపుల వృత్తాంతం, కపిల చరిత్ర, భక్తియోగం వంటి వివిధ విష
లున్నాయి.

చతుర్థ (నాలుగవ) స్కంధంలో మరీచ్యాది తొమ్మిదిమంది ప్రజాప

ఉత్పత్తి, దక్షయజ్ఞ విధ్వంసం ధృవచరిత్ర పృథువుకథ ప్రాచీనబర్హి యితిహాసం వర్ణితమైనాయి.

పంచమ (ఐదవ) స్కంధంలో ప్రియవ్రతోపాఖ్యానం, నాభి, వృషభ భరతుల చరిత్రలు, దీప, వర్ష, సముద్ర, పర్వత, నదీనదుల వర్ణన జ్యోతిశ్చక్ర వివరం, నరక పాతాళాల స్థితి వివరించబడినాయి.

షష్ఠ (ఆరవ) స్కంధంలో దక్షుని ఆవిర్భావం. దక్షపుత్రికల సంతాన వివరణ, వారివల్ల సృష్టి విస్తరణ, వృత్రాసురోపాఖ్యానం ఉన్నాయి.

సప్తమ (ఏడవ) స్కంధంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపుల కథ. ప్రహ్లాదోపాఖ్యానం వివరించబడినాయి.

అష్టమ (ఎనిమిదవ) స్కంధంలో గజేంద్రమోక్షం, మన్వంతర వర్ణన మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, హయగ్రీవాది అవతారాలు క్షీర సాగర మథనం ఉన్నాయి.

నవమి(తొమ్మిదవ)స్కంధంలో ఇక్ష్వాకుకథ, సూర్యవంశవివరణ, సగర రామ చరిత్రలు, పరశురాముని కథ, చంద్రవంశ రాజుల వర్ణన ఉన్నాయి.

దశమ (పదవ) స్కంధంలో శ్రీకృష్ణుని బాల్యక్రీడలు రాసలీలలు, కంసవధ, శ్రీకృష్ణ పరిణయం కృష్ణ విజయగాథలు, భూభారహరణం వంటి దివ్యగాథలు రసవత్తరంగా వివరింపబడినాయి.

ఏకాదశ (పదకొండవ) స్కంధంలో యదువంశ నాశనం, కృష్ణ ఉద్ధవ సంవాదం కృష్ణావతార పరిసమాప్తి వర్ణితమైనాయి.

ద్వాదశ (పన్నెండవ) స్కంధంలో యుగలక్షణాలు, కలియుగ, వివర్ణ నాలుగు రకాల ప్రళయాలు, మూడురకాల సృష్టులు, వేదశాఖల వర్ణన పరీక్షిత్తు దేహత్యాగం, మార్కండేయ చరిత్ర, సూర్యవివరణ మొదలయిన విష్ణురహస్య విషయాలు వర్ణితమైనాయి.

ఈ రకంగా భక్తి, జ్ఞాన వైరాగ్య విషయాలను రమణీయంగా ఛేదించి నది కనుక భాగవతాన్ని మధుర సఫల భరితమయిన రసాలం (మామిడి చెట్టు) అని సాహితీ విదులు శిరసున దాల్చారు.

అటువంటి సంస్కృత భాగవతాన్ని పోతనగారు తేట తెలుగు పద్యాలతో ఆంధ్రజాతికి అందించారు. ఆయన రామాజ్ఞానుసారం యీ కావ్యాన్ని వ్రాసి చిరయశస్సు నార్జించారు. భాగవత కథలు ప్రేరపగా దేశంలో ఒకానొక ఘట్టంలో భక్తితత్వం ఉద్యమంగా విస్తరిల్లింది. చైతన్య మహాప్రభువువంటివారు భాగవత ధర్మాన్ని అనుష్టించి భక్తితత్వాన్ని ప్రచారం చేశారు. సురదాసువంటి కవులు అజరామరయిన కవితలల్లి కృష్ణావతారాన్ని అక్షయం చేశారు.

కృష్ణలీలలతో సంగీత రూపకాలు వెలిశాయి. నవలలు, నాటకాలు విలసిల్లాయి. విప్రలంభ శృంగారపరమైన పదకవితకు రాధాకృష్ణ ప్రణయ కథ ఆలంబనం అయింది. భారతదేశంలోని ప్రజలందరకూ రాముడు, కృష్ణుడు ఆరాధ్యులయ్యారు. రామాయణ, భారత, భాగవతాలు నిత్య పఠనీయాలయ్యాయి. భాగవత కథను ఎందరో యెన్నో రూపాలలో నాటికీ, నేటికీ వ్రాస్తూనే ఉన్నారు. మా తండ్రిగారు పురాణపండ రామమూర్తిగారు మూలభాగవతానికి వ్యాఖ్యానంతో అచ్చ తెలుగు అనువాదం అందించారు. దశమస్కంధంలో కృష్ణతత్వంపై ఆయన వ్రాసిన వ్యాఖ్యాన గ్రంథం తెలుగులో ఆ రీతి గ్రంథాలలో తలమానికమయినది.

ఇంతటి భావవిస్తృతిగల భాగవత మహాగ్రంథం చదవాలనే వారికి యీ చిన్న పుస్తకం చిరుదీపం మాత్రమే. స్థాలీపులాక న్యాయంగా ఈ భాగవతం చదివి పెద్దయినాక వ్యాసర్షి వెలయించిన సంస్కృత భాగవతాన్ని పోతన్నగారు పోతపోసిన అచ్చ తెలుగు పద్య భాగవతాన్ని ఆకళింపు చేసుకొని, ఆపై భాగవతతత్వాన్ని అవగతం చేసుకొంటారన్న ఆశతోనే బాలబాలికలకు ఈ బొమ్మల భాగవతాన్ని అందిస్తున్నాను. ఇక భాగవత మహాసౌధంలో మొదటి స్కంధం వెదజల్లే కాంతులు చూద్దాం.

## పురాణ తిలకం

నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులు సత్రయాగం చేశారు. తీరిక వేళల్లో సూతుడు వారికి సకల పురాణాలు వినిపించాడు. వారి కోరికను పురస్కరించుకొని ఆయనే పురాణ తిలకమయిన శ్రీమద్భాగవతాన్ని ప్రవచించాడు.

అధ్యయన, అధ్యాపన సంప్రదాయం భారతీయ వ్యవస్థలో ఒక విశిష్ట పద్ధతి. గురువునుంచి విద్యను నేర్చుకొనడం, దానిని మరల శిష్యులకు బోధించడం యీ పద్ధతి భారతీయ ధర్మశాస్త్రాలన్నీ అలా ప్రచురితమైనవే. రామాయణాన్ని శివుడు పార్వతికి చెప్పాడు. ఆ తర్వాత దాన్ని వాల్మీకి కుశలవులకు బోధించి గానం చేయించాడు. మహాభారతాన్ని వ్యాసుడు తన శిష్యులలో ఒకడైన వైశంపాయనుని ద్వారా జనమేజయ మహారాజుకు చెప్పించాడు. దానినే మరల సూతుడు శౌనకాదులకు వినిపించాడు.

అలాగే మహాభాగవతాన్ని వ్యాసమహర్షి తన కుమారుడయిన శుకునకు బోధించాడు. శుకమహర్షి ఆ కథను మహాభాగవత శిఖామణి అయినా పరీక్షిత్తునకు వినిపించాడు. ఆ క్రమంలోనే సూతుడు శౌనకాదులకు భాగవత పురాణం చెప్పాడు.

# పరీక్షిత్తు

కురుక్షేత్ర యుద్ధానంతరం పాండవులు పరిపాలన సాగించి, ఆ తర్వాత సామ్రాజ్యాన్ని తమ మనుమడు అభిమన్యుని కుమారుడు అయిన పరీక్షిత్తుకు పట్టం కట్టి పాండవులు మహాప్రస్థానం చేశారు.

మేనమామ అయిన ఉత్తరుని కుమార్తె ఐరావతిని పరీక్షిత్తు వివాహం చేసుకున్నాడు. అశ్వమేధాలు చేశాడు. అతడు ధర్మరాజువలె ప్రజారంజకంగా ధర్మబద్ధంగా పరిపాలన చేస్తున్నాడు. ఎక్కడా అతివృష్టులులేవు. అనావృష్టులులేవు అకాలమరణాలులేవు. ధర్మోల్లంఘనలులేవు, నాలుగువర్ణాల వారు తమకు విధించిన పనులన్నీ యథావిధిగా చేసుకొని పోతున్నారు. పరీక్షిత్తును ప్రజలందరూ ధర్మప్రభువని వేనోళ్ళ కీర్తిస్తున్నారు.

ఒకనాడాయన వేటకై అరణ్యానికి వెళ్ళాడు. క్రూరమృగాలు ఎన్నింటినో వేటాడాడు. బాగా అలసిపోయాడు. మంచినీటిని అన్వేషిస్తూ ఒక ఆశ్రమానికి వచ్చాడు.

# శృంగి శాపం

అది మహాముని తపస్సంపన్నుడు అయిన శమీకుని ఆశ్రమం పరమ పావనంగా నిలాంత నిశ్శబ్దంగా వుంది. ఆశ్రమంలో ఎవ్వరూ లేరు. శమీకుడు



శమీకుని మెడలో పాము

మాత్రం దర్భాసనంపై కూర్చుని సమాధిలో ఉన్నాడు. పరీక్షిత్తు ఆశ్రమ ప్రాంతం అంతా నీటికై వెతకి, వెతకి ఆశ్రమంలోకి వచ్చాడు.

అక్కడ నిశ్శబ్ద వాతావరణంలో శమీకుడు తపస్సు చేసుకొంటున్నాడు.

ఆయనకు ఈ బాహ్య ప్రపంచపు సంగతులు తెలీవు. ఆ స్థితిని సమాధి స్థితి అంటారు. నీటికై మహర్షి ని అడిగాడు. ఆయనకు వినపడలేదు. అసలు ఆస్థితిలో యేమీ వినపడదు. పరిపరివిధాల మహర్షి నుంచి నీటిని పొందాలని ప్రయత్నించి ఎంతకు శమీకుడు పలకకపోవడంతో విసుగుచెంది పరీక్షిత్తు ఆ సమీపంలో చచ్చి



శృంగి శాపం

పడివున్న పామును తెచ్చి ఆయన మెడలోవేసి రాజధానికి వెళ్ళిపోయా
ఈ సంగతులు ఏమీ శమీకునకు తెలియదు. ఆయన సమాధిలోనే ఉన్నాడు.

శమీకుని కొడుకు శృంగి. అతడు అడవిలోనికి సమిధలకై వెళ్ళా

అవి సంగ్రహించుకొని తిరిగి ఆశ్రమానికి వచ్చాడు. తపస్సమాధిలో నిశ
ఉన్న తన తండ్రి మెడలో పాము కళేబరం ఉండడం చూశాడు.
ఆ పామును దూరంగా విసిరివేశాడు. అతడికి ఆగ్రహం కలిగింది. చీ:
హానిచేయని తన తండ్రికి పాము కళేబరాన్ని మెడలోవేసి అవమా
వారెవరని దివ్యదృష్టితో చూశాడు.

పరీక్షిత్తు రూపం, అతడు దప్పికతో రావడం, తండ్రి మా
పోవడం, ఆయన పాము కళేబరాన్ని శమీకుని మెడలోవేసి వెళ్ళి
శృంగికి కనిపించింది.

తపోధనులైన మహర్షుల్ని కాపాడి గౌరవించవలసిన రాజు ర
నికి పాల్పడ్డారని ఆగ్రహించి శృంగి యిలా శపించాడు.

## భాగవత సప్తాహం

"బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడు. తపస్వి అహింసామూర్తి అయిన నా
మెడలో చచ్చిన పామును వేసిన ఆ అహంకారి ఎవరైనాసరే నేటికి వారం
లలో తక్షకుండనే పాము విషానికి గురై మరణించును గాక!!"

శృంగి యిలా శపించి, ఆశ్రమ పనులలో నిమగ్నుడయ్యాడు. ఇ
శమీకుడు సమాధి చాలించి లేచాడు. తండ్రికి సేవలుచేసి శృంగి తన
గురించి ఆయనకు చెప్పాడు.

శమీకుడు ఎంతో నొచ్చుకున్నాడు. ధర్మపరిపాలకుడయిన ప
యేవో ఆవేశంతో చేసిన పొరపాటుకు అతడికి ప్రాణాంతక శాపం విధి
శమీకుని యెంతగానో బాధించింది. వెంటనే మునిబాలకుడు ఒకడిని పిలి
శాప వృత్తాంతం చెప్పిరావలసినదని పరీక్షిత్తు దగ్గరకు పంపాడు. ఆ బా
పరీక్షిత్తు దగ్గరకు వెళ్ళి శృంగి పెట్టిన శాపం గురించి చెప్పాడు.

పరీక్షిత్తు తన తప్పిదానికి యెంతగానో బాధపడ్డాడు. మంత్రి
హితుల్ని రావించి తను చేయవలసిన ధర్మరక్షణ కార్యాలు గురించి అడి
అప్పుడు మంత్రులు యిలా అన్నారు.

"మహారాజా! గంగానదీ మధ్యలో ఒంటి స్తంభం మేడ నిర్మింపచేద్దాం. మీరందులో ఉండండి. తక్షకుడు అక్కడకు రాలేడు."

మంత్రుల అభీష్టానుసారం వెనువెంటనే ఒంటి స్తంభం మేడ నిర్మిత



శుకుని భాగవత ప్రవచనం

మయింది. పరీక్షిత్తు అందులో వుంటున్నాడు. అప్పుడు పురోహితులు యిలా అన్నారు.

"పరీక్షిన్నరేంద్రా! విప్రుని శాపం వృథాపోదు. అందుకని యీ ఏడు రోజులలో నువ్వు సద్గోష్టిచేయి. శుకమహర్షిని రావించి భాగవతం విను. పుణ్య

లోకాలు సిద్ధిస్తాయి. నువ్వు నిర్వర్తించిన ఈ విధి భావితరాలకు "భాగవత సప్తాహంగా అందివస్తుంది."

పురోహితుల హితవచనాలు విని పరీక్షిత్తు భాగవతా సప్తాహ పూజా కార్యక్రమం ప్రారంభించాడు. శుకమహర్షి వచ్చాడు. భాగవతాన్ని పరీక్షితునకు వినిపించాడు. ఏడవరోజున తక్షక విషాగ్ని కీలలకు పరీక్షిత్తు పాంచభౌతిక శరీరం విడిచి విష్ణు సాయుజ్యం పొందాడు. ఆ ఏడు రోజులలో శుకుడు చెప్పిన భాగవతాన్ని యిప్పుడు సంగ్రహంగా చెప్పుకుందాం.

## అవతారాలు

పురుషోత్తముడయిన శ్రీమన్నారాయణుడు యెన్నో అవతారాలు యెత్తి లోకాన్ని ఉద్ధరించాడు. ఆదిలో సనక, సనందున, సనత్కుమార, సనత్సుజతులనే బాలకులుగా అవతరించారు. వారు బ్రహ్మవేత్తలై లోకానికి మార్గోపదేశం చేశారు, భూదేవిని వుద్ధరించడానికి వరహావతారం ఎత్తాడు. పాంచ రాత్రూనయ ప్రచారానికై నారద రూపం ధరించాడు. నరనారాయణ రూపాలు ధరించాడు. కపిలుడై సాంఖ్యయోగాన్ని వివరించాడు. దత్తాత్రేయుడైనాడు. యజుడై పుట్టి స్వాయంభువ మన్వంతరాన్ని రక్షించాడు. ఋషభుడుగా అవతరించాడు. పృథు చక్రవర్తిగా ప్రభవించి భూమిని కాపాడాడు. మత్స్యావతారం ధరించాడు. కూర్మ రూపుడయ్యాడు. జగన్మోహిని అయ్యాడు. నృసింహావతారంలో హిరణ్యకశివుణ్ని సంహరించాడు. వామనుడయ్యాడు. పరశురాముడయి భూమిని జయించాడు. రాముడుగా అవతరించి ధర్మాన్ని రక్షించాడు. వ్యాసునిగా పుట్టి పురాణాతిహాసాలందించాడు. కృష్ణావతారుడై లీలలెన్నో ప్రదర్శించాడు. బుద్ధవతారంలో దేవ ద్వేషుల్ని వంచించాడు. కలియుగాంతంలో "కల్కి"గా పుట్టి లోకాన్ని ఉద్ధరిస్తాడు. శ్రీహరి అవతారాలను అంశావతారాలను, కళావతారాలనీ అంటారు. అయితే కృష్ణావతారం మాత్రం పూర్ణావతారం. ఆ కథ ముందు ముందు తెలుసుకొందాం.

# విశ్వవిరాట్

శ్రీ మహావిష్ణువే విశ్వ విరాట్రూపంలో విలసిల్లుతున్నాడు. నీరు, అగ్ని, వాయువు, ఆకాశం. ఈ రూపానికి ఆవరణాలు. ఈ పురుషునికి పాతాళం పాదాలు. రసాతలం పార్ష్ణిభాగం. గుల్ఫాలు రెండూ మహాతలం తొడలు తల



ప్రళయ వేళ శ్రీమహావిష్ణు

తలజానుభాగం సుతలం, అతల వితలాలు ఊరుభాగాలు, భూమి పొత్తికడుపు, ఆకాశం బొడ్డు స్వర్గలోకం వక్షస్థలం. మహర్లోకం కంఠసీమ, జనోలోకం ముఖం, తపోలోకం లలాటం వేయి ముఖాలుగల భగవంతుని శిరస్సే సత్య

లోకం, దేవతలు భుజాలు, దిక్కులు చెవులు, అశ్వనీ కుమారులు ముక
శంఖం ఘ్రాణేంద్రియం అగ్నిహోత్రుడే ముఖం, ద్యులోకం కళ్ళు, సూర
దృష్టిశక్తి, రాత్రింబవళ్ళు కనురెప్పలు. జలం తాలుభాగం, రసం నాలుక, వే
బ్రహ్మరథం, యముడు కోరలు. స్నేహకళలు పలువరుస, మహామాయ అ
చిరునవ్వు, ధర్మం స్తనభాగం, అధర్మం వెనుకభాగం, సముద్రం కుక్షి,
తాలు అస్థులు, నదులు నాడి సమూహం, వృక్షాలు రోమాలు, మహావా
శ్వాస, కాలం గమనం, మేఘాలు కేశాలు, సంధ్య వస్త్రం, అవ్యక్తం హృద
రుద్రుడు అహంకారం, మనుష్యులే విరాట్పురుషుని నివాసస్థానం, దేవగ
షడ్జమాదిస్వరాలు, రాక్షసులు పరమ పురుషుని వీర్యం. ఇది విశ్వ విరాటు
షుని వర్ణన. అంటే ఈ ప్రకృతి అంతా అతడే అని అర్థం.

## సృష్టి-వికాసం

విశ్వశక్తి రూపుడయిన శ్రీహరి సంకల్పం కారణంగా ఈ సృష్టి
గింది. అది వేయి విధాలుగా వికసించి, విస్తరించింది. ఈ క్రియాకలాపాన్ని
రించేదే వైశ్విక దర్శనం.

ప్రకృతిలో మూడు శక్తులున్నాయి. అవి 1. జ్ఞానశక్తి 2. క్రియా
3. ద్రవ్యశక్తి. ఈ మూడు శక్తుల సమ్మేళనాల రూపమే సృష్టి అంతా
పెద్దలు అంటారు. ఆదికాలంలో మొదట ఆకాశం జన్మించింది. దాని గు
శబ్దం. ఆకాశంలో జన్మించిన కల్లోలంవల్ల వాయువు పుట్టింది దాని గుణం శ
స్పర్శ కూడాను, వాయువునుంచి అగ్ని పుట్టింది. దీనికి శబ్ద, స్పర్శ, రూపా
బాటు 'రసం' అనే గుణం వచ్చింది. జల వికారం కారణంగా భూమి జ
చింది. దీనికి శబ్దం, స్పర్శరూప, రసగుణాలతోబాటు 'గంధం' అనే గు
కూడా వచ్చింది. ఈ రకంగా ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి
ఐదు భూతాలు ఏర్పడి వీటి నుంచే మిగిలిన సృష్టి కొనసాగింది.

అయితే ఇందుకు కోట్ల సంవత్సరాలు పట్టింది. మొట్టమొదట

బ్రహ్మాండం నిర్జీవంగా ఉంది. అప్పుడు శ్రీహరి దానిలో జీవశక్తిని ప్రసరించాడు. దానితో ఆ బ్రహ్మాండం నుంచి సమస్త సృష్టి జరిగింది. అదే విరాట్పురుషుని సృష్టి క్రమం. ఆ పురుషుని యందు ఈ విశ్వమంతా వుంది. దీనికే "దశాంగుళ



సృష్టి వికాసం

న్యాయం" అని వేదాంత శాస్త్రం చెబుతోంది. అంటే భూమికంటే పదిరెట్లుజలం. జలం కంటే పదింతలు అగ్ని, అగ్నికంటే పదింతలు వాయువు, వాయువుకన్నా పదింతలు ఆకాశం వున్నాయని దీని అర్థం.

# పదిరకాల సృష్టులు

ఎంతో విస్తృత గుణం కల యీ సృష్టిని పదిరకాలుగా విభాగిం
అవి 1. మహత్తత్వం : ఇది సృష్ట్యాదినాటి నిశ్చబ్ద స్థితి 2. అహంకారం
దశలోనే దశేంద్రియాలకు కల్పన జరిగింది. 3. భూతస్వర్గం : యీ స్థితి
పంచభూతాలకు ఆలంబనమైన తన్మాత్రలుంటాయి. 4. ఇంద్రియసృష్టి :
స్థితిలోనే జ్ఞాన, క్రియాది గుణాల ఆవిర్భవిస్తాయి. 5. అధిష్టాన సృష్టి : ఇ
యాలు, మనసు, ఏర్పడే దశ. 6. అవిద్రాసృష్టి : ఇది మోహ మహామో
ఆశ్రయించే స్థితి. 7. స్థావరసృష్టి : ఇది వృక్షాల సృష్టికాలం. 8. పశుస్మ
ఇది వివిధరకాల పశువులు, పక్షుల సృష్టించబడిన దశ. 9. మనుష్యస్మ
మానవజాతి ఆవిర్భవించిన ఘట్టం ఇది. 10. దైవికసృష్టి : ఇది మరల మొ
మహత్తత్వదశవంటిదే కాని మానవులు విశేషశక్తులు కలిగి వుంటారు.

ఈ రకంగా సృష్టిని జీవపరిణామాన్ని మహాభాగవతం చక్కగా
రించింది.

ఇక్కడ ఆధునిక జీవపరిణామాన్ని కూడా ఒకసారి మననం
కొంటే భాగవతం సృష్టి. వికాసం గురించి చేసిన వివరణ యెంత హేతుబద్ధ
అర్థం అవుతుంది.

కోట్ల సంవత్సరాల క్రితం ఈ సృష్టిలో శూన్యం తప్ప ఏమీ
తర్వాత ఆది మేఘం (నెబులా) ఆవిర్భవించింది. గ్రహాలు నక్షత్రాలు వచ్చా
సూర్యకుటుంబం అవతరించింది. సముద్రాలు ఏర్పడ్డాయి. భూమి ఏర్పడి
ఏకకణజీవి వచ్చింది. బహుకణ జీవులు పుట్టాయి. సముద్ర జంతువులు, ఉ
చరాలు, ఆకాశచరాలు, భూచరాలు, మానవులు వచ్చారు. ఇది ఆధునిక శ
వేత్తలు చెప్తున్న సిద్ధాంతం భాగవతం పేర్కొన్న "బ్రహ్మాండం" అనే
"ఆది మేఘాని"కి సరిపోలుతుంది. మొత్తం మీద భారతీయులు అతిప్రా
కాలంలోనే సృష్టి జీవపరిణామం గురించి ఒక అవగాహన చేశారనడానికి
భాగవత వర్ణనను ఒక ఉదాహరణగా చెప్పవచ్చు.

# కాలగణన

"కనిపించే వస్తు ప్రపంచంలో కనిపించకుండా కదిలిపోయేది కాలం ఒక్కటే. అందుకే సంఘటనల రూపాంతరం కాలం అన్నారు. విడిగా అది నిర్విశేషం. అది అనంతం అందుకే కాలాన్ని భగవత్స్వరూపంగా, భగవంతుణ్ని కాలస్వరూపుడుగా వర్ణించారు. అయితే మరి కాలాన్ని యెలా కొలుస్తారు? ఈ ప్రశ్నకు సమాధానంగా భాగవతం యిలా చెపుతోంది.

రెండు "పరమాణువులు" ఒక "అణువు" మూడు అణువులు "త్రసరేణువు" కిటికీ ద్వారా సూర్యకిరణం ప్రసరిస్తున్నప్పుడు కంటికి కనిపించేవే త్రసరేణువులు. ఇటువంటి మూడు "త్రసరేణువు"ల్ని దాటటానికి సూర్య కిరణానికి పట్టే కాలం ఒక "తృటి" నూరు తృటులు ఒక "వేధ" మూడు వేధలు ఒక "లవం" మూడు లవలు ఒక "నిమిషం" మూడు నిమిషాలు ఒక "క్షణం" ఐదు క్షణాలు "కాష్ట" పదిహేను కాష్టలు ఒక "లఘువు" పదిహేను లఘువులు ఒక "నాడి" రెండునాడులు ఒక "ముహూర్తం" చరులేక యేడునాడులు ఒక "ప్రహరం" దీనినే "యామం" అంటారు. అంటే మనుషుల పగలు లేక రాత్రి కాలంలో యిది నాలుగవ భాగం. ఇటువంటి ఎనిమిది 'యామ'లు ఒక రోజు. ముప్పైరోజులు నెల, ఆరునెలలు ఒక అయనం. రెండు అయనాలు ఒక సంవత్సరం. నూరేళ్ళు మానవాయుర్దాయం. కాలస్వరూపుడయిన సూర్యుడు పరమాణువు మొదలు సంవత్సరం వరకు పన్నెండురాశులు గల యీ విశ్వంలో ప్రదక్షిణ చేస్తుంటాడు.

యీ కాలక్రమాణాన్ని హెచ్చువేస్తూపోతే యుగాలు వస్తాయి. యుగాలు నాలుగు. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం

కృతయుగం పదిహేడు లక్షల 28 వేల సంవత్సరాలు. త్రేతాయుగం 12 ల
96 వేల సంవత్సరాలు. ద్వాపరయుగం 8 లక్షల 64 వేల సంవత్సరాలు.కలియు
4 లక్షల 32 వేల సంవత్సరాలు. నాలుగుయుగాల కాలాన్ని మహాయు
అంటారు. ఇటువంటి 71 మహాయుగాలు అయితే ఇక మనువు కాలం అవుతు
అంటే 326720000 సంవత్సరాలకాలం. ఇదే మన్వంతరం. ఇప్పటికి ఆరుగ
మనువులయ్యారు. ఇప్పుడు ఏడవ మనువు కాలం నడుస్తోంది. వేయి మహాయ
అయితే బ్రహ్మకు ఒక పగలు, మరో వేయిమహాయుగాలు గడిస్తే ఆయనకు రా
ఇది ఒక కల్పం. కల్పానికి పధ్నాలుగుమంది మనువులుంటారు. బ్రహ
ఆయుర్దాయంలో సగభాగాన్ని పరార్ధం అంటారు. ఇప్పటికి ఒక పరార్ధం నడిచ
రెండవ పరార్ధం నడుస్తోంది. మొదటి పరార్ధం అది బ్రహ్మకల్పం. పద్మకల
నడిచాయి. బ్రహ్మ ఆవిర్భవించిన కల్పం అది బ్రహ్మకల్పం. అది శబ్దబ్రహ
రూపం పద్మకల్పంతో బ్రహ్మ విష్ణువు నాభినుంచి జన్మించిన తామరపూవు ను
పుట్టాడు. అందుకే పద్మకల్పం అయింది అది.

ఇప్పుడు నడుస్తున్న రెండవ పరార్ధపు మొదటి కల్పాన్ని శ్వే
వరాహ కల్పం అంటారు. యీ కల్పంలోనే శ్రీహరి వరహావతారం యెత్తా
అందుకే దీనికీ పేరు వచ్చింది. పరమాణువు నుంచి ద్వితీయపరార్ధం వర
విస్తరించి వచ్చిన కాలం పరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువుపై. ఎటువంటి ప్ర
వాన్ని ప్రసరించదు. అలాంటి శ్రీహరిలీలలు తెలుసుకొందాం.

## వరాహమూర్తి

సృష్టి విస్తరించింది. మన్వంతరాలు గడిచాయి. మొదటి పరార్ధం పూ
అయింది. బ్రహ్మగారి ఆయుర్దాయంలో ద్వితీయ పరార్ధం ప్రారంభం అయిం

ప్పటికి సృష్టి చేయగల సర్వశక్తులతో బ్రహ్మ మాత్రం వున్నాడు. "సృష్టి ఎలా మాలా" అని ఆయన ఆలోచిస్తున్నాడు. బ్రహ్మకు "క" వేదవాఙ్మయంలో రుంది. ఆ ఆలోచనలలో ఉండగానే ఆయన శరీరం రెండుభాగాలైంది. అందుకే నిని 'కాయ' అన్నారు. ఒక భాగం పురుషుడు, రెండవభాగం స్త్రీ. ఆ పురుషుడే స్వయంభువు. ఆ స్త్రీయే శాత్నత. వారిద్దరే యీ సృష్టిలో దాంపత్య జీవితానికి ంకురార్పణ చేశారు. వారి సాంసారిక జీవిత ఫలంగా ప్రియవ్రతుడు. ఉత్తాన ాదుడు అనే కొడుకులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కుమా ెలు జన్మించారు. వీరి సంతానం కాలక్రమంలో ప్రపంచం అంతా విస్తరించింది.

అప్పటికి భూమి మహాసముద్రంలో మునిగివుంది.స్వయంభువుయొక్క ంతానానికి, వారి సంతతికి అంటే యీ మనుష్యజాతికి నివసించే చోటు కనిపించ దు.

అప్పుడు స్వయంభువు బ్రహ్మనిలా ప్రార్థించాడు.

"తండ్రీ! నీ సంకల్పంచేత యీ సృష్టిలో స్త్రీ పురుష లింగభేదంతో వులు, మానవులు అవతరిస్తున్నారు. వారు నివసించటానికి యోగ్యమైన భూమి ముద్రంలో మునిగిపోయి ఉంది. దానిని ఉద్ధరించి పైకితీసి లోకోపకారంచెయ్యి. పై ప్రజాపాలనం, మనుష్య విస్తార కార్యాలను నీ ఆనతిన నేను నెర ేరుస్తాను."

స్వయంభువు మాటలు విన్న బ్రహ్మ చుట్టూ కలియ జూసాడు. అంతా హా సముద్రం. గ్రహ నక్షత్రాలు మాత్రం ఆకాశ మార్గాన పరిభ్రమిస్తున్నాయి.

మానవ సంతతి జీవులు నివసించడానికి యోగ్యమైన స్థలంలేదు. భూమిసముద్రం
మునిగిపోయి ఉంది. దానిని పైకి తీయాలంటే యేం చేయాలి అని దీర్ఘంగా ఆ
చిస్తున్న బ్రహ్మ ముక్కు నుంచి అంగుష్ఠ ప్రమాణం గల ఒక వరాహం జ
చింది. అది నిమేష కాలంలోనే ఐరావతంవలె పెరిగిపోయింది. అందరూ
వరహమూర్తిని చూసి ఆశ్చర్యపడ్డారు. అది శ్రీహరి అవతారం అని గు
చారు. వేద ఋక్కులలో ఆ స్వామిని స్తుతించారు.

వరాహస్వామి ఎంతో వేగంతో ఆకాశంలో గంతులు వేశాడు! ఆ
శరీరం ధృడంగా ఉంది. వంటిమీది రోమాలు శూల్లాలా ఉన్నాయి. తెల్లనికో
ప్రకాశిస్తున్నాయి కళ్ళు సూర్య చంద్రులవలె కాంతులీనుతున్నాయి.

ఆయన ప్రళయ సముద్రంలో మునిగాడు. వరహానికి వాసనను
వస్తువును గుర్తించే విచిత్ర శక్తి ఉంది. భూమి గంధవతి అందుకే శ్రీహరి
హావతారం ఎత్తాడు. సముద్రంలో భూమి ఉనికిని గుర్తించడానికై వాసనచూ
కలియ తిరుగుతున్నాడు. కోరలతో సముద్రగర్భాన్ని కలిచివేస్తున్నాడు. తో
సాగర జలాలను చిలుకుతున్నాడు. వేగంగా ఈది సముద్ర తలాన్ని అ
కుతలం చేస్తున్నాడు.

అలా వెతికి సముద్రం క్రింద రసాతలంలో మునిగివున్న భూ
చూశాడు. బంతివలె పట్టుకొన్నాడు. వాడి తేలిన కోరలపై నిలిపాడు ప్రచ
వేగంతో సముద్రం నుంచి పైకి వస్తుంటే హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు
గించాడు. వాడు అక్కడ రాజు. భూమిని ఎవ్వరూ తీసుకుపోవడం వా
యిష్టంలేదు.

అందుకే వరాహమూర్తిపై విరుచుకొనిపడ్డాడు. యజ్ఞవరాహమూర్తి గద ధరించాడు. హిరణ్యాక్షుడు కూడా గదను తీసుకొన్నాడు. ఇద్దరూ భయంకరంగా పోరాడారు. గదలు ముక్కముక్కలైనాయి. వరాహస్వామికోరపై చంద్రబింబం వలె భాసిస్తున్న భూమిని అందుకోవాలని హిరణ్యాక్షుడు ప్రయత్నించాడు. అప్పుడు ఆ స్వామి హిరణ్యాక్షుని అతి లాఘవంగా చేతిగోళ్ళతో, చర్మం మీద వజ్రాలవంటి రోమాలతో గుచ్చి చంపాడు.

హిరణ్యాక్షుడు హాహాకారం చేస్తూ ప్రాణాలు విడిచాడు. అతని శరీరం నుంచి ప్రాణజ్యోతి వెలువడి వరాహస్వామిలో ఐక్యం అయింది. హిరణ్యాక్షుని వధించి, భూమిని సముద్రంపైకి తెచ్చాడు వరాహస్వామి. అప్పుడే దేవతలు, ప్రజాపతులు, మహర్షులు ఆయనను ప్రార్థించి ఇలా అన్నారు.

"యజ్ఞపురుషా! వరాహస్వామీ! నీకిదే నమస్కారం. ఈ భూమిని సముద్రంపై తేలి ఉండేటట్లు ప్రతిష్ఠించు. సముద్రం చెలియలికట్టదాటి రాకుండా శాసించు. ఆ రకంగా భూమి సకల చరాచర జీవరాశికి నివాసయోగ్యం అవుతుంది. ఇది మా ప్రార్థన.

వారందరి ప్రార్థన విని యజ్ఞవరాహమూర్తి భూమిని సముద్రంపై నిలిపాడు. చెలియకట్ట దాటిరావద్దని సముద్రుణ్ని శాసించాడు. అందరిని దీవించి అంతర్థానం అయ్యాడు.

యజ్ఞవరాహస్వామి పరాక్రమ గాథను కిన్నెర, కింపురుషాదులు గానం చేశారు. భూమాత పులకరించింది. సకల జీవరాశిని తనపై విలసిల్లమని భూదేవి ఆదరంగా లాలించింది. అలా ఆదిమకాలంలో శ్రీహరి వరాహమూర్తియై భూమిని ఉద్ధరించాడు. సృష్టికి నవజీవనం ప్రసాదించాడు. ఈగాథ సకల శుభప్రదం అని భాగవత విదులు అంటారు.

## జయవిజయులు

కల్పాంతరాల నాటి సంగతి. వైకుంఠంలో శ్రీమహావిష్ణువు శ్రీలక్ష్మితో ఏకాంతంలో ఉన్నాడు. వారి ఆ ప్రణయ ఏకాంతం సృష్టిలీలలో ఒక చిద్విలాసం.

వైకుంఠ సింహద్వారం దగ్గర జయ విజయులు కాపలికాస్తున్నారు. వారు విష్ణుమూర్తికి ప్రీతిపాత్రులు. వారికి శ్రీహరి అంటే ప్రాణం ఆయన సన్నిధిని విడిచి ఉండలేరు వారు.

లక్ష్మీనారాయణుల ఏకాంతాన్ని ఎవరూ భంగపరచకుండా వారు అప్ర



జయ విజయులకు శాపం

మత్తులై కావలి కాస్తున్నారు. ఇంతలో శ్రీహరిని దర్శించాలని సనకసనందాదులు వచ్చారు. జయ విజయులు వినలేదు. వారికి దారి యివ్వలేదు. దానితో ఆగ్రహించిన వారు జయ విజయుల్ని శపించారు.

"మీరు శ్రీహరికి దూరమైపోతారు"-అని సనక సనందులు వెళ్ళిపో యారు.

తర్వాత శ్రీహరికి జయవిజయులు మొరపెట్టుకున్నారు. అప్పుడు లీలా మానుషరూపుడైన శ్రీహరి యిలా అన్నాడు.

"జయవిజయులారా! మునులశాపం వమ్ముకాదు. పైగా అది లోకోప కారం. స్నేహభావంతో ఆరు జన్మలలో మీరు నన్ను చేరతారా? లేదా శత్రువులై మూడుజన్మలలో నా సామ్రాజ్యం పొందుతారా?"

శ్రీహరి మాటలు విన్న జయవిజయులు ఇలా అన్నారు.

"మహాపురుషా! ఆరుజన్మలకాలం నీకు దూరంగా మేం ఉండలేం కనుక నీతో శత్రుత్వం వహించి మూడు జన్మలలోనే నీ దగ్గరకు వచ్చేస్తాము."

అప్పుడు విష్ణుమూర్తి "అలాగే కానీండు. సమయం వచ్చినప్పుడు మీకు ఆదేశిస్తాను. రాక్షసులుగా జన్మిం స్తుందురుగాని" అని చెప్పాడు. జయవిజయులు ఊరట చెందారు.

## నూరేళ్ళ గర్భం

దక్షుడు తన కన్యలలో పదమూడు మందిని కశ్యపునకు ఇచ్చి వివాహం చేశాడు. వారిలో ఒకామె పేరు దితి. ఆమెకు పిల్లలు లేరు. మిగిలిన వారందరికీ సంతానం కలిగింది. ఆ లోటు దితిని విపరీతంగా వేధించింది. ఒకనాడు అసుర సంధ్యవేళ కశ్యపుడు యజ్ఞదీక్షలో వున్నాడు. ఆ సమయంలో దితి కామపరవశ అయింది. ఆమె భర్తను చేరి తనకు పుత్రభిక్ష పెట్టమంది. సంధ్యవేళ దాంపత్యం పనికిరాదని కశ్యపుడు చెప్పాడు. అయినా ఆమె వినలేదు. కశ్యపుడు ఆమెకు దాంపత్యసుఖం ప్రసాదించాడు. ఆమె గర్భవతి అయింది. అసురసంధ్యవేళ, దేవ నియమానికి వ్యతిరేకంగా సంచరించి గర్భం ధరించిన ఆమెకు "దుష్టులైన రాక్షసులు ఇద్దరు జన్మిస్తారని" కశ్యపుడు శపించాడు.

అప్పుడు దితి తపశ్శక్తిచేత నూరుఏళ్ళు గర్భం మోసింది. ఆ సమ

యంలో ఆమె తన శిశువులకు సకలశక్తులు సమకూర్చాలని ప్రయత్నించింది ఆమె సంకల్పం ఫలించి సూర్యచంద్రాదుల శక్తి, అష్టదిక్పాలుర తేజస్సు ఇంద్రాదుల బలపరాక్రమాలు గర్భస్థశిశువులలో చేరాయి. ఆయా దేవతల తేజస్సు క్షీణించసాగింది.

ఈ పరిస్థితి చూసి రుషులు, దేవతలు మహావిష్ణువను ప్రార్థించారు ఆయన అభయం ఇచ్చి పంపాడు. జయవిజయుల్ని దితి గర్భంలో ప్రవేశించమని ఆదేశించాడు. వారా ప్రకారం చేరారు.

నూరు సంవత్సరాలు అయిన తర్వాత దితి కవలల్ని ప్రసవించింది వారే హిరణ్యకశిప, హిరణ్యాక్షులు. వారు పుట్టినవేళ సముద్రం ఘోషించింది దిక్కులు రంగులు మారాయి. ఉల్కలు పడ్డాయి. గాడిదలు వోండ్రపెట్టాయి అన్నీ దుశ్శకునాలే కనిపించాయి. అప్పుడు దితి భర్తను తన పుత్రులకు ఉత్తమ గతి ప్రాప్తించేటట్లు అనుగ్రహించమని ప్రార్థించింది. దానికి కశ్యపుడు యిలా అన్నాడు.

"వీరు బ్రాహ్మణద్వేషులై యజ్ఞకర్మ ద్వేషులై ప్రవర్తిస్తారు. చివరకు శ్రీమహావిష్ణువు చేత సంహరించబడి వైకుంఠం చేరుతారు."

కశ్యపుని మాటలు దితికి ఊరట కలిగించాయి. హిరణ్యకశిపుడు హిరణ్యాక్షుడు పెరిగి పెద్దవారయినారు. లోక కంటకులయ్యారు. హిరణ్యాక్షుడు భూమిని అపహరించబోయి వరాహమూర్తిచేత చంపబడ్డాడు. ఇక హిరణ్యకశిపుడున్నాడు. ఆ కథ తర్వాత చెప్పుకొందాం. జయవిజయులు ఒక జన్మలో విష్ణు ద్వేషులై వైకుంఠం చేరారు. మరొక జన్మలో రావణ కుంభకర్ణులయారు. మూడవ జన్మలో శిశుపాల, దంతవక్త్రులయ్యారు. రావణ కుంభకర్ణుల్ని విష్ణుమూర్తి శ్రీరామావతారం యెత్తి సంహరించాడు. కృష్ణావతారంలో శిశుపాల, దంతవక్త్రుల్ని చంపాడు. ఇలా మూడు జన్మలలో జయవిజయులు శాపవిముక్తిపొంది విష్ణు సాయుజ్యం పొందారు.

# కపిలుడు

స్వాయంభువ మనువు కుమారులు ప్రియవ్రతుడు. ఉత్తానపాదుడువీరు ఈ భూమండలాన్ని యేలిన ఉత్తమ చక్రవర్తులు. మనువు కుమార్తె దేవహూతి. ఆమె సకల సద్గుణరాశి. ఆమెను ఆయన మహావిభవశాలి అయిన కర్దమునకు యిచ్చి వివాహం చేశాడు.

కర్దముడు మహావిష్ణు భక్తుడు. బ్రహ్మ ఆదేశం మేరకు కర్దముడు సరస్వతీ నదీతీరంలో పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. విష్ణుసాక్షాత్కారం పొందాడు. అతడి వంటి కుమారుడు కావాలని వరం కోరాడు. అప్పుడు విష్ణుమూర్తి యిలా అన్నాడు.

"కర్దమా! శతరూపా! స్వాయంభువుల కుమార్తె దేవహూతి నీకు భార్య అవుతుంది. ఆమె యందు తొమ్మిదిమంది కన్యలు నీకు కలుగుతారు. వారు మరీచ్యాది ఋషుల్ని పరిణయమాడి నీ వంశాన్ని వృద్ధి పరుస్తారు. నేను నీ ద్వారా దేవహూతి యందు జన్మించి లోక కళ్యాణం చేకూరుస్తాను."

అనంతరం కొన్నాళ్ళకు కర్దమునకు దేవహూతితో వివాహం అయింది, అక్కడ నుంచే వారుభయులు బ్రహ్మావర్త దేశం వెళ్ళిపోయారు. దానికి రాజధాని బర్హిష్మతీనగరం. అది వరాహస్వామి భూమిని ఉద్ధరించి, శరీరం దులుపుకొనగా రాలిన రోమాలు పడి అక్కడ దర్భలు మొలిచాయి. ఋషులు ఆ దర్భలతో యజ్ఞాలు చేసి రాజ్యాన్ని నిర్మించిన ప్రదేశం కనుక అది బర్హిష్మతీ నగరం అని పేరొందింది. కర్దముడు ప్రజారంజకంగా పాలన చేస్తున్నాడు. అంతేకాక దేవహూతి కోరికను మన్నించి సర్వఋతువులలోనూ సర్వసుఖాలూ యివ్వగల విమానం ఒకదానిని సృష్టించాడు.

దానిలో వుంటూ వారిద్దరూ ఆనందంగా కాలం గడుపుతున్నారు. అయినా దేవహూతికి తృప్తి కలగలేదు. అప్పుడు సరస్వతీ నదీతీరానగల బిందు సరోవరంలో స్నానం చేయమన్నాడు. ఆమె అలా చేసింది. మరుక్షణంలో సకల

భోగాలు సమకూర్చగల దివ్యభవనం వచ్చింది. కర్దముని యోగశక్తికి దేవహ
ఆశ్చర్యపడింది. తర్వాత వారిరువురు భూమండలం అంతా విహరించారు. ఆవె
ఒకే ప్రసవంలో తొమ్మిదిమంది ఆడపిల్లలు పుట్టారు. కర్దముడు సన్యాసం స్వీ
రిస్తానన్నాడు. అప్పుడు దేవహూతి పుత్రసంతానం కావాలంది. వారి ప్రణం
ఫలితంగా శ్రీహరి బాలకుడై జన్మించాడు. అతడే కపిలుడు. సాంఖ్యదర్శనా
రచించి లోకానికి ఉపకారం చేశాడు.

ఆ తర్వాత కర్దముడు తన ఆడపిల్లలతో 'కళా' అనే కుమార్తె
'మరీచి'కి 'అనసూయ'ను 'అత్రి'కి 'శ్రద్ధ'ను 'అంగీరసు'నకు 'హవిర్భూ
'పులస్త్యునకు' 'గతి'ని 'పులహో'న'కు 'క్రియ'ను 'క్రతువు'నకు 'ఖ్యాతి
'భృగు' నకు 'అరుంధతి'ని 'వశిష్టు'నకు 'శాంతి'ని 'అధర్వు'నకు ఇ
పెళ్ళిళ్ళు చేశాడు. వారు వారు తమ తమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు. కర్దము
కూడా తపస్సుకు వెళ్ళిపోయాడు.

కపిలుడు తల్లి దేవహూతికి చెప్పిన యోగశాస్త్ర విషయాలు, సాం
దర్శన విశేషాలు తత్వశాస్త్రంలో ఎంతో పేరొందాయి. ఈ రకంగా శ్రీప
కపిలుడై అవతరించి 'సాంఖ దర్శనం' అనుగ్రహించాడు.

## హిరణ్యకశిపుడు

ఇంతవరకు మూడు స్కంధాలకథ సంక్షిప్తంగా చెప్పుకొన్నాం.

నాలుగవ స్కంధంలో మరీచి మొదలైన తొమ్మిదిమంది ప్రజాపత
వివరం, దక్షయజ్ఞ విధ్వంసం, పృథు చరిత్ర, ప్రాచీనబర్హి కథ వర్ణితమైనాం
ధవుడి కథ కూడా ఈ స్కంధంలోనే ఉంది.

అలాగే ఐదవ స్కంధంలో ప్రియవ్రతునికథ, నాభి, వృషభ, భ
తుల చరిత్ర, ద్వీప, వర్షసముద్రం, పర్వతాదుల వివరణ, 'జ్యోతిశ్చక్ర వర్ణ
మొదలైనవి వున్నాయి.

ఆరవ స్కంధంలో దక్షుని జననం, పశుపక్ష్యాది మానవసృష్టి మొ
లైన వివరాలున్నాయి.

ఏడవస్కంధంలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల చరిత్ర, ప్రహ్లాదోపాఖ్యానం వున్నాయి.

ఇప్పుడు హిరణ్యకశిపుని కథ తెలుసుకొందాం.

హిరణ్యాక్షుణ్ని శ్రీహరి వరాహావతారం యెత్తి చంపాడు. అప్పటి నుంచి అతని సోదరుడైన హిరణ్యకశిపుడు విష్ణుమూర్తిపై పగపట్టాడు. విష్ణువుని జయించి పరాభవించాలని నిశ్చయించుకొన్నాడు. అది అంత సులభమైనపని కాదు. కనుక బ్రహ్మగురించి తపస్సు చేసి దివ్యమైన శక్తినిచ్చే వరాలు పొందాలని భావించి, మందర పర్వత గుహలో ప్రవేశించి, తపస్సు ప్రారంభించాడు.

## బ్రహ్మవరాలు

హిరణ్యకశిపుడు ముఖం పైకెత్తి చేతులు ఆకాశంలోకి సారించి, శ్రద్ధగా తపస్సు చేస్తున్నాడు. అతడి మహోగ్ర తపస్సుకు భూమి కంపించింది. సముద్రాలు ఊగాయి. చుక్కలు చెదిరిపోయి, లంబికా యోగసాన చేసిన అతడి శరీరం నుంచి వెలువడుతున్న వెడికి అక్కడి మొక్కలు కమిలిపోయాయి. చుట్టూపుట్టలు పెరిగాయి. చర్మాన్ని పురుగులు ఆశ్రయించాయి. మాంసాన్ని రక్తాన్ని కీటకాలు పీల్చివేశాయి. అయినా లెక్కచేయక నూరు సంవత్సరాలు హిరణ్యకశిపుడు తపస్సు సాగించాడు. అతడి దీక్షకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరంకోరుకోమన్నాడు. అప్పుడు హిరణ్యకశిపుడు ఇలా వరం కోరాడు.

"గాలిలోకాని, భూమిపైనకాని, అగ్నిలోకాని, ఆకాశంలోకాని, రాత్రి కాని, పగలుకాని, మరణం రారాదు. అలాగే మనుషులవల్లకాని, జంతువులవల్ల కాని, నాకు మృత్యువు సంభవించరాదు. అస్త్ర, శస్త్రాలలో దేనివల్లా నాకు చావు సంప్రాప్తించకూడదు."

ఇంతవరకూ ఎవరూ కోరని విచిత్రవరాన్ని హిరణ్యకశిపుడు కోరాడు. బ్రహ్మ ఆ వరం ప్రసాదించాడు. దానితో ఆరాక్షసుడు ఆనందపరవశుడై విజృంభించాడు. దేవ, కిన్నెర, గంధర్వ, కింపురుషాదుల్ని తీవ్రహింసలు పెట్టాడు.

విష్ణుభక్తుల్ని పీడించసాగాడు. యజ్ఞాల్ని ధ్వంసం చేయసాగాడు. అతడి అ
త్యాలకు అంతంలేకుండా పోయింది.

హిరణ్యకశిపుని బాధలు, దుష్కృత్యాలు భరించలేక దేవతలు, మున
శ్రీహరి దగ్గరకువెళ్ళి మొరపెట్టుకున్నారు. ఆయన వారికి అభయం ఇచ్చాడు.



ప్రహ్లాదుని మందలిస్తున్న హిరణ్యకశిపుడు

## ప్రహ్లాదుడు

హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు అనే కొడుకు వున్నాడు. అతడు విష్ణు
భక్తుడు. ఎల్లప్పుడు హరినామ స్మరణం చేస్తుండేవాడు. ఇది హిరణ్యకశిపున

కష్టంగా వుంది. కుమారుని దృష్టిని విష్ణుమూర్తినుంచి మళ్ళించాలని గురుకులానికి పంపాడు. అక్కడ కూడా అతడు హరినామ సంకీర్తనం చేస్తూ తోటి బాలకుల్ని కూడా విష్ణుభక్తుల్ని చేయసాగాడు. అయినా, విద్యలన్నీ బాగా నేర్చుకున్నాడు. హిరణ్యకశిపునకు యీ సంగతి తెలిసింది. ఎన్నో విధాలుగా చెప్పి చూశాడు. ప్రహ్లాదుడు విష్ణుభక్తి విడవలేదు. భయపెట్టాడు. అయినా అతడి బుద్ధిమారలేదు.

చివరకు యేనుగుచేత తొక్కించాడు. ఫలితం లేకపోయింది. పర్వతంపై నుంచి తోయించగా శ్రీమన్నారాయణుడే కాపాడాడు. మంటలలో వేయించాడు. అగ్నిదేవుడు చల్లారిపోయాడు. పాములచేత కరిపించబోయాడు. ప్రహ్లాదుని హరి నామ సంకీర్తనానికి నాగుపాములు తలలాడించి, వెళ్ళిపోయాయి తప్ప అతడిని యేమీ చేయలేదు.

దీనితో మరీ కోపగించిన హిరణ్యకశిపుడు విష్ణువు యెక్కడ ఉన్నాడో చూపించమని ప్రహ్లాదుణ్ణి శాసించాడు. అప్పుడు ఆ బాలకుడు ఇలా అన్నాడు.

"తండ్రీ! శ్రీహరి సర్వత్రా వ్యాపించి వున్నాడు. అక్కడలేడు ఇక్కడ లేడు" అనే సందేహం అక్కరలేదు. ఆ చక్రపాణి సర్వాంతర్యామి. ఎందెందు వెదికిచూచినా అందందే కలడు. చక్రిని ఎక్కడ చూపమంటే అక్కడ చూపిస్తా.

## నరసింహుడు

ప్రహ్లాదుని మాటలు విని హిరణ్యకశిపుడు కోపగించాడు. కుమారుడి హరిభక్తిని పరీక్షించాలని సంకల్పించాడు. అప్పుడు సంధ్యాకాలం కావస్తున్నది. హిరణ్యకశిపుడు గదను చేతబూని "ఈ స్తంభంలో శ్రీహరి ఉన్నాడా?" అని ప్రశ్నించాడు.

"**ఉన్నాడు**" అని ప్రహ్లాదుడు వినయంగా ధైర్యంగా బదులు చెప్పాడు.

"అయితే చూపించు" అని హిరణ్యకశిపుడు గదతో ఆ స్తంభాన్ని బద్దలు కొట్టసాగాడు. అప్పుడు ప్రహ్లాదుడు చేతులు జోడించి "పాహిమాం! రక్షమాం! శ్రీహరీ!" అని ప్రార్థించాడు.

స్తభం రెండుగా చీలింది. పెళపెళార్భటులు వ్యాపించాయి. ఉరుము
ఉరిమాయి. మెరుపులు మెరిశాయి. సప్త సముద్రాలు గోషించాయి.

ఆ సంధ్యాసమయంలో, లోకాన్ని మృత్యు చీకట్లు క్రమ్ముతున్న వే
ఆ స్తంభం నుంచి దివ్యమైన వెలుగుతో నరసింహస్వామి అవతరించాడు ఆయన



న ర సిం హా వ తా ర ం

సింహంతల, మనిషి శరీరం, ఒడలంతా మెరుపు తీగలవంటికేశాలు చేతులక
వజ్రాలవంటి పదునైన గోళ్ళు, ఆస్వామి మహోగ్రరూపంధరించి హిరణ్యకశి
నిపై లంఘించాడు. ఆ రాక్షసుడు తప్పించుకొనలేకపోయాడు.

ఉగ్రనరసింహమూర్తి హిరణ్యకశిపుణ్ని లాఘవంగా పట్టుకొని ఒ

ద్వారం దగ్గరకు లాక్కుపోయాడు. గడపపై తాను ఆసీనుడయ్యాడు. హిరణ్యకశిపుని తన తొడలపై పరుండబెట్టాడు. గిలగిల తన్నుకొంటున్న హిరణ్యకశిపుని కడుపును తన వాడి గోళ్ళతో చీల్చి, ప్రేగులు పైకిలాగాడు. వాటిని మెడలో వేసుకొన్నాడు. ఆ దానవుని రక్తాన్ని పానం చేశాడు.

అది రాత్రీకాదు, పగలూకాదు, సంధ్యాసమయం. నరసింహస్వామి మనిషీకాదు, మృగమూకాదు. రెండూకలసిన వింత అవతారం. అస్త్రంతోనూ కాదు. శస్త్రంతోనూ కాదు. వాడి గోళ్ళతో హిరణ్యకశిపుణ్ణి చంపారు.

ప్రహ్లాదుడు ఆ స్వామిని శాంత పరిచాడు. ఆయన భక్తుల్ని అనుగ్రహించి, ఆశీర్వదించి, అంతర్థానంఅయ్యాడు. ఆ తర్వాత ప్రహ్లాదుడు చక్రవర్తియై రాజ్యపాలనచేసి, మహాభాగతోత్తముడుగా చిరకీర్తిని పొందాడు. ఈ కథ సకల విఘ్నహారకం అని భక్తుల విశ్వాసం.

## ఆరుగురు మనువులు

ఇప్పటికి ఆరు కల్పాలు గడిచాయి. మొదటి మనువు స్వాయంభువు. రెండవ మనువు స్వారోచిషుడు. మూడవ మనువు ఉత్తముడు. నాలుగవ మనువు పేరు తామసుడు. ఐదవ మనువు రైవతుడు. ఆరవ మనువు పేరు చాక్షుషుడు.

నాలుగవ మనువు తామసుని కాలంలోనే శ్రీహరి వేధారుషి భార్య అయిన హరిణిదేవి గర్భవాసాన నారాయణమూర్తిగా అవతరించి గజేంద్రుని మొసలి బారినుండి రక్షించాడు. ఆ కథ చదువుకొందాం.

## గజేంద్రుని వైభవం

అది త్రికూట పర్వత ప్రాంతం. ఇది పాలసముద్రంలో ఉంది. దీనిఎత్తు పదివేల యోజనాలు. ఆ పర్వతాన్ని ఆశ్రయించి రకరకాల మొక్కలు, లతలు, చెట్లు పెరిగాయి. అదంతా పెద్ద అడవి అక్కడ ఎన్నోరకాల పక్షులు, జంతువులు కాపురం వుంటున్నాయి. అక్కడే వరుణుని ఉద్యానవనం వుంది. దానిలో

నివసించే ఏనుగుల మందలకు మహాబలవంతుడైన ఒక ఏనుగు రాజు. దాని పే
గజేంద్రుడు. పది లక్షలకోట్ల ఆడ యేనుగులకు మగడు. దాని వైభవం, వైభో
అంతా యింతా కాదు.

అది తన ఏనుగుల మందతో నడిచి వెళుతుంటే పర్వతమే క
వెళుతున్నట్లుండేది. ఒకనాడది తన ఆడపరివారంతో ఒక సరస్సులో జలకాల
ప్రారంభించింది. ఇష్టం వచ్చినట్లు నీటిని విరజిమ్మసాగింది. తామరతూడ
పెకలించి వేయసాగింది. ఆడ యేనుగులపై తొండంతో నీరు చిమ్మి సర
లాడింది.

ఇంతలో దాని కాలిని బలమైన మొసలి పట్టుకొని, లోపలకు లాగిం
గజరాజు పైకి రావాలని పెనుగులాడింది. ప్రయోజనం లేకపోయింది. తమ మ
అవస్థ చూసి, జాలిపడికూడా ఏమీ చేయలేక ఆడ ఏనుగులు గట్టెక్కిపోయా
ఫలితం లేకపోయింది. మొసలికి నీటిలో బలం యెక్కువ. అందుకే మహాబలవ
మైనప్పటికీ ఏనుగు గట్టెక్కలేక పోయింది.

శరీరం చిక్కిపోయింది. బలం క్షీణించింది. ఏమీ చేయలేక అప్పు
తొండం ఎత్తి కనులు ఆకాశంవైపు తిప్పి ఇలా ప్రార్థించింది.

"శ్రీమన్నారాయణా! ఇన్నాళ్ళూ నా బలం నన్ను కాపాడుతుం
అనుకొన్నాను. నా బలగం నన్ను రక్షిస్తారని ఆశించాను. కాని నా ఆశలు అ
యాసలయ్యాయి. నా శక్తియుక్తులు ఉడిగిపోయాయి. నువ్వు తప్ప వేరే రక్షకు
లేరు. కాపాడు, నన్ను రక్షించు."

గజేంద్రుని మొర ఆలకించిన శ్రీమహావిష్ణువు వేగంగా వైకుం
నుంచి దిగి వచ్చాడు. చక్రాయుధం ప్రయోగించాడు. అది గిర్రున తిరుగుతూ వె
మొసలి తలను ఖండించి వచ్చింది. గజేంద్రుని కాలు బయటపడింది.

వెంటనే గజేంద్రుడు ఒడ్డుకు వచ్చి శ్రీహరికి నమస్కరించి, ప్రార్థన
చేసి, తామర పూలతో పూజించాడు. శ్రీమహావిష్ణువు మొసలికి మోక్షం ఇచ్చా
గజేంద్రుణ్ని ఉద్ధరించాడు.

గజేంద్రమోక్షం కథ సకల శత్రు వినాశకరం అని భక్తులందరి విశ్వాసం. ఇది తామస మనువు కాలంనాటి కథ. ఇక ఇప్పుడు కూర్మావతారం కథ చెప్పుకొందాం.

## దుర్వాసుని శాపం

అది చాక్షుష మనువుకాలం. ఈ కాలంలోనే శ్రీమహావిష్ణువు కూర్మావతారం యెత్తి దేవతలకు ఆ అమృతం పంచి, రాక్షసులను వంచించాడు.

మూడు లోకాలను పరిపాలిస్తున్న ఇంద్రుడు ఒకనాడు ఐరావతంపైపధ్నాలుగు లోకాలూ తిరుగుతున్నాడు. అదే సమయంలో దుర్వాసమహర్షి వైకుంఠం నుంచి వస్తున్నాడు. ఇంద్రుణ్ని చూశాడు. అతడి ముఖంలో పల్లమాలిన గర్వం తొణికిస లాడుతుంది.

దుర్వాసుడు విష్ణుమూర్తి తనకు యిచ్చిన తులసి దండను ఇంద్రునకు ఇచ్చాడు ఇంద్రుడు దానిని నిర్లక్ష్యంగా ఐరావతానికి అందించాడు. ఆ ఏనుగు ఆ మాలను కాలిక్రిందవేసి చిందర వందర చేసింది. దుర్వాసుడు ఇంద్రుని అహంకారాన్ని చూచి కోపగించాడు. మూడు లోకాలు తన ఆధీనంలో వున్నాయని అతడు గర్విస్తున్నాడని గ్రహించాడు. వెంటనే ఇలా శపించాడు :

"ఇంద్రా! అధికారదర్పంతో కన్ను గానకుండా వున్నావు. విష్ణుప్రసాదమైన ఆ తులసిమాలను శిరసున దాల్చవలనదిపోయి నిర్లక్ష్యంగా ఏనుగుకు ఇచ్చి నన్నుఅవమానించావు. నీ అహంకారం నశించుగాక. నీ రాజ్యం రాక్షసుల వశం అగుగాక!"

దుర్వాసుడు ఇలా శపించి వెళ్ళిపోయాడు. కొంతకాలానికి దేవతల శక్తియుక్తులు క్షీణించాయి. బలిఅనే రాక్షస చక్రవర్తి విజృంభించి దేవలోకంపై విజయం సాధించాడు. ఇంద్రుడు అధికారం కోల్పోయాడు. తేజోహీనుడయాడు. ఈ పరిస్థితికి దేవతలు, మునులు ఎంతో దుఃఖించారు.

రాక్షసులు మాత్రం అన్ని విధాల సుఖాలు అనుభవిస్తున్నారు. అధికారం వారిది. ఆనందం వారిది. పరిస్థితి తారుమారు కావడంతో బ్రహ్మ దేవత

లను వెంటబెట్టుకొని వైకుంఠానికి వెళ్ళి శ్రీమహావిష్ణువును ప్రార్థించారు. ఆ ప్రత్యక్షంఅయి దేవతల బాధలు విన్నాడు. సముద్రమథనం చేస్తే అమ వస్తుందని, దానిని త్రాగడంవల్ల దేవతలకు మరల దివ్యశక్తి రావడమే అమరత్వం సిద్ధిస్తుందని విష్ణుమూర్తి వారికి హితవు చెప్పాడు.

## సాగర మథనం

లోకాలన్నీ రాక్షసుల అధీనంలో వున్నాయి. వారి అనుమతి పాలసముద్రాన్ని మథించే అవకాశం లేదు. అందుకని దేవతలు వారితో వ డారు. రాక్షసులు సముద్ర మథనానికి అంగీకరించారు.

అందరూ కలిసి, తమ బలాన్ని వుపయోగించి మంథరాచలాన్ని మోసుకొని వచ్చారు. సముద్రంలో వేశారు. వాసుకి అనే నాగరాజును కవ్వంగా చుట్టారు. దేవతలు ఆ పాము శిరస్సుపై వుంటామన్నారు. దానికి సులు అంగీకరించలేదు. పాము తోకభాగం నీచమైనది కనుక ఆ వైపు ఉండబోమని వారన్నారు. దేవతలు రాక్షసులకు వాసుకి తలవైపు భాగ ఇచ్చారు. తాము తోక వైపు భాగాన్ని పట్టుకొన్నారు. వాసుకి వెదజల్లే విష జ్వాలలకి కొందరు రాక్షసులు చచ్చిపోయారు. అయినా లెక్కచేయక సమ మథనం ఆరంభించారు.

## కూర్మావతారం

సముద్రాన్ని మంథరాచలంతో చిలుకుతోంటే పెద్ద శబ్దం వస్తోంది. ధ్వని దేవతలకు శుభసూచకంగా ఉంది. రాక్షసులకు మృత్యు ధ్వనిగా ఆ స్తోంది.

అడుగున ఏ ఆధారం లేకుండా మంథరపర్వతాన్ని తిప్పుతుండ వల్ల అది సముద్రంలోనికి దిగిపోసాగింది. అప్పుడు దేవతలు శ్రీహరిని ప్రా చారు. ఆయన మహాబలవంతమైన తాబేటి రూపం ధరించి పర్వతం క్రిందద దానిని మూపునదాల్చి పైకి ఎత్తాడు. అదే కూర్మావతారం.

సాగర మథనం సాగింది. తొలుత సముద్రం నుంచి తలలు, గుల్మాలు వృక్షాలు రత్నాలు వచ్చాయి. ఆ తర్వాత హాలాహలం వచ్చింది. దానిని పరమ శివుడు పానం చేసి కంఠంలో నిలుపుకొన్నాడు. ఆ తర్వాత ఐరావతం, ఉచ్చై శ్రవం, కల్పవృక్షం, కామధేనువు వచ్చాయి. వాటిని ఇంద్రునకు ఇచ్చారు. ఆ



కూ ర్మా వ తా ర ం

తర్వాత లక్ష్మీదేవి పుట్టింది. ఆమెను శ్రీమహావిష్ణువు వివాహంచేసు కొన్నాడు ఆ తర్వాత చంద్రుడు పుట్టాడు.

అయినా దేవతలు, రాక్షసులు సంతృప్తి చెందలేదు. అమృతం ప
వరకూ పట్టుదలతో, సాగరమధనం సాగించారు.

## జగన్మోహిని

రత్నాలు ఆవిర్భవించినా సంతృప్తి చెందలేదు. కాలకూటవిషం పుట్టి
భయపడలేదు! నిపుణమతులైన దేవ, దానవులు పట్టు విడువక చేసిన సము
మధనం ఫలించింది. పాలసముద్రం కడుపునుంచి అమరత్వం ప్రసాది
అమృతం పుట్టింది. అమృత కలశాన్ని రాక్షసులు అపహరించుకుని పోయా
దేవతలు అడ్డగించారు. ఉభయులు పోరాడారు. అలసిపోయారు. అమృతకల
యెవరికి దక్కాలా అని మీమాంస పడుతూనే వున్నారు. ఇంతలో అఖిలలోకాల
శ్చర్యకరమైన సౌందర్యంతో జగన్మోహిని అనే స్త్రీమూర్తి వారి ముం
ప్రత్యక్షం అయింది.

మూడు లోకాలను మోహపరిచే ఆ రూపం చూసి రాక్షసులు ఆశ్చ
పోయారు. ఆడవేషం వేసినవాడు శ్రీమహావిష్ణువని దేవతలు గ్రహించారు.
మాయా మానుషధారి ఏం చేయనున్నాడో అని ఎదురుచూడసాగారు.

రాక్షసులు ఆ స్త్రీమూర్తి వెంటబడ్డారు. అప్పుడు జగన్మోహిని యి
అంది :

"అమృతకలశం నాకు ఇవ్వండి. మీ అందరికీ పంచుతాను."

ఆమె సౌందర్యంతో ఆలోచన పోయిన రాక్షసులు ఆ కలశం ఆమె
అందించారు! ఆమె దేవ, దానవుల్ని రెండు వరుసలలో కూర్చోబెట్టింది.

రాక్షసుల్ని తన మాటలతో మైమరపించి, జగన్మోహిని అతి నేర్పు
అమృతాన్ని దేవతలకు పంచిపెట్టింది. శ్రమతో పాలుపంచుకొన్న రాక్షసులక
జగన్మోహిని చిరునవ్వు దక్కింది. దేవతలకు అమృతం లభించి చిరంజీ
లయ్యారు.

తంబూలం యివ్వబోగా అడ్డగించిన శిశుపాలుణ్ని సంహరించాడు. శిశుపాలుని స్నేహితుడైన దంతవక్త్రుడు తనను ఎదిరించగా అతడినికూడా చంపాడు.

తదుపరి రాయబారియై విశ్వరూపం ప్రదర్శించాడు. యుద్ధంలో అర్జున సారథియై పాండవులకు విజయం చేకూర్చాడు. ఈ కథలూ, గాథలూ అన్నీ మహాభాగవతంలో ఎంతో విపులంగా వర్ణితమైనాయి. అవన్నీ కృష్ణలీలా వైభవ కథలు.

# కుచేలుడు

ఉజ్జయినీ నగరంలో సాందీపని గురుకులంలో కృష్ణునితోబాటు ఒక బ్రాహ్మణ విద్యార్థికూడా చదువుకొన్నాడు. అతనిపేరు సుదాముడు. చిరిగిన వస్త్రాలు ధరించేవాడు కనుక అతడిని కుచేలుడు అని పిలిచేవారు.

అతడు చాలా పేదవాడు. పైగా గంపెడు సంసారం. ఒకనాడు భార్య సలహాను పురస్కరించుకొని శ్రీకృష్ణుని సహాయాన్ని కోరదామని వచ్చాడు. బాల్య స్నేహితుని చూసి ఎంతో సంతోషించి, మర్యాదలు చేశాడు. శ్రీకృష్ణ వైభవాన్నిచూసి కుచేలుడు ఆనంద పరవశుడయ్యాడు. ఏమీ అడగలేకపోయాడు. మరునాడు తెల్లవారుతూనే యింటికి వెళ్ళిపోయాడు.

అక్కడకు చేరేసరికి తన పర్ణశాలకు బదులు పెద్దమేడ ఉంది. అన్ని ఐశ్వర్యాలు కృష్ణుడు ప్రసాదించాడని కుచేలుడు ఆనందించాడు. మిత్రత్వానికి పేద, ధనిక భేధాలు లేవని ఈ కథ మనకు నీతిని బోధిస్తుంది.

మనువు దేవసావర్ణి. పద్నాలుగవ మనువు ఇంద్రసావర్ణి. ఇవి రాబోయే మన్వంతరాలు. ఇలా మొత్తం పద్నాలుగు మన్వంతరాలు గురించి భాగవతంలో వివరణ వుంది.

# మృతసంజీవని

అమృతాన్ని త్రాగి మరల బలపరాక్రమాలు పొందిన దేవతలు ఇంద్రుని నాయకత్వంలో బలిచక్రవర్తిపై దండయాత్ర చేశారు. దేవతలకు రాక్షసులకు పోరు ఘోరంగా సాగింది.

రాక్షసులు లక్షల సంఖ్యలో మరణించారు. బలిచక్రవర్తికూడా ప్రాణాలు విడిచాడు.

అయితే రాక్షస గురువైన శుక్రాచార్యుడు మృతసంజీవనీ విద్యతో బలిని బ్రతికించాడు. సర్వావయవాలు వుండి, ప్రాణాలుపోయిన రాక్షసుల్ని అందర్నీ శుక్రుడు తన విద్యా ప్రభావంతో జీవింపజేశాడు. శుక్రునకు యీ విద్య పరమ శివుడు యెప్పుడో బోధించాడట!

పునరుజ్జీవితుడైన బలి గురువు ఆశ్రమంలోనే వుండిపోయి భృగు వంశీయులయిన బ్రాహ్మణుల నందరినీ శ్రద్ధాభక్తులతో సేవించాడు. వారాతని చేత దివ్యశక్తిని ప్రసాదించే యజ్ఞం చేయించారు. దానినే 'విశ్వదిగ్యాగం' అంటారు.

ఆ యజ్ఞ ఫలంగా బలికి దివ్య రథం వచ్చింది. దివ్యాయుధాలు లభించాయి. కవచం వచ్చింది. బలి ఎవరోకాదు. ప్రహ్లాదుని మనుమడు.

ప్రహ్లాదుని కొడుకు విరోచనుడు. అతడి కొడుకు బలి. మనుమనికి ప్రహ్లాదుడు ఎన్నడూ వాడిపోనటువంటి మాలను బహూకరించాడు.

ఇలా బలి సకల విధాల శక్తిసామర్థ్యాలను కూడదీసుకొని దేవలోకంపై దండెత్తాడు. ఇంద్రుడు యెదురు నిలిచాడు. అయినా బలిచక్రవర్తియొక్క అవక్ర పరాక్రమం ముందు ఇంద్రుడు నిలువలేక, దేవలోకాన్ని విడిచి పలాయనం చిత్తగించాడు. దేవలోకం బలికి వశమైంది. ఇంద్రుడు ఎక్కడా తగిన నిలువ

పీడలేక అల్లల్లాడుతున్నాడు. ఇటు విశ్వకర్మ నిర్మించిన అమరావతి నగరాన్ని బలి ఆధీనం చేసుకొన్నాడు.

## అమ్మ ఆవేదన

దేవతల తల్లి అదితి. అందుకే వారు అదితేయులయ్యారు. వారి తండ్రి కశ్యపుడు. బలిచక్రవర్తివల్ల తన పిల్లలకు కలిగిన కష్టాలుచూసి అదితి ఎంతగానో ఆవేదన పడింది. వారి కష్టాలు తీర్చాలని ఆలోచించింది. భర్తను సలహా అడిగింది అప్పుడు కశ్యపుడు ఇలా అన్నాడు.

"అదితీ! శ్రీమహావిష్ణువు మాత్రమే దేవతల కష్టం గట్టెక్కించగలడు ఆయనను సేవించు."

కశ్యపుని హితవచనాలు విని అదితి శ్రీమన్నారాయణుణ్ని ఆరాధించింది. కశ్యపుని ద్వారా శ్రీహరి అదితి గర్భాన ప్రవేశించాడు. అదితికి ప్రసవ సమయం ఆసన్నమయింది.

## వామనుడు

ప్రకృతి సకల శుభప్రదంగా కనిపిస్తోంది. చంద్రుడు శ్రవణానక్షత్రంలో ఉన్నాడు. అది భాద్రపద శుక్ల ద్వాదశి, అభజిల్లగ్నం నక్షత్రగ్రహాదులు ఉన్నత స్థితిలో ఉన్నాయి. అటువంటి మంగళప్రదమైన వేళ శ్రీహరి అదితి గర్భాన పుట్టాడు. దేవత లానందించారు. పుట్టినప్పుడు దివ్యశక్తిని ప్రదర్శించిన ఆ బాలుడు, వామనరూపం ధరించాడు. అతడికి కశ్యపుడు, అదితి ఒడుగు చేశారు.

బలిచక్రవర్తి అశ్వమేధయాగం చేస్తున్న సమయం అది. దానానికి అతడికి పెట్టినది పేరు. వామనుడు యాగశాలకు వచ్చాడు. బ్రహ్మవర్చస్సు, క్షాత్రతేజం కలిగిన ఆ వటువును బలి అభిమాన పురస్సరంగా వేదిక వద్దకు ఆహ్వానించాడు. వామనవటువు సామగానంతో బలిని ఆశీర్వదించాడు. యజ్ఞ

సమయంలో దాన, ధర్మాలు చేయడం వేదవిహితం. బలి ఆ ప్రకారం విశేషంగా దాన ధర్మాలు చేశాడు.

వామనమూర్తి తనకు "మూడు అడుగుల స్థలం" దానం యిమ్మని కోరాడు. బలి ఇస్తానన్నాడు. రాక్షస కులగురువు శుక్రాచార్యుడు అడ్డగించాడు. అయినా బలి వినలేదు. ఇచ్చినమాట తప్పను అన్నాడు. వామనమూర్తికి మూడడుగుల నేల దానం చేశాడు.

## ఇంతింతై వటుడంతై

వామనమూర్తి నేలను దానం తీసుకొన్నాడు. శరీరాన్ని పెంచాడు. ఒక పాదంతో భూమిని కొలిచాడు. రెండవపాదంతో విశాలసృష్టి అంతటిని కొలిచాడు. బొటనవ్రేలి ప్రమాణంలో కనిపించని వటువు చూస్తుండగానే ఇంతింతై, ఎదిగి పోయాడు, పాదం మోపడానికి యెక్కడా స్థలంలేదు. యీ త్రివిక్రమ విజృంభణ రూపాన్ని పోతన్నగారు భాగవతంలో అద్భుతంగా వర్ణించారు.

"మూడవ పాదం యెక్కడ మోపమన్నావని" వామనుడు అడగగా బలి శిరస్సు చూపించాడు. వామనుడు తన పాదాన్ని బలి తలపైవుంచి, అతడిని రసాతలానికి అణగ్రతొక్కాడు.

బలిచక్రవర్తి తనకు దానం చేసిన ఈ పద్నాలుగు లోకాలను వామనుడు ఇంద్రునికి యిచ్చి తన అవతరాన్ని ముగించి అంతర్ధానం అయ్యాడు.

వామనావతార కథ అన్ని కోరికలు తీరుస్తుందని పెద్దలు చెబుతారు.

## మత్స్యావతారం

కల్పాంతంనాటి మాట. బ్రహ్మయోగనిద్రలో ఉన్నాడు. ఆయనముఖాల నుంచి వేదాలు పుట్టాయి. ఆ సమయంలో అక్కడ పొంచి వున్న హయగ్రీవుడు అనే రాక్షసుడు ఆ వేదాలను అపహరించుకొనిపోయాడు. అతడినే సోమకాసురుడు అని కూడా అంటారు.

ఆకాలంలో సత్యవ్రతుడు అనే రాజుండేవాడు. అతడు మహా విష్ణ భక్తుడు. ఒకనాడాయన నదిలో స్నానం చేసి, సంధ్యావందనం చేసి, అర్ఘ యిస్తుండగా ఒక చేప ఆయన దోసిలి లోనికి వచ్చి యిలా అంది.

"సత్యవ్రతా! నేను నీ ఆరాధ్య దైవం అయిన విష్ణుమూర్తి



మత్స్యావతారం

లోకకళ్యాణం కోసం యీ చేప అవతారం యెత్తాను. నన్ను పెంచు కొన్నాళ్ళ ప్రళయం వస్తుంది. అప్పుడు ఒక నావ వస్తుంది. దానిలో సప్తర్షుల్ని ధాన్యాల ఉంచు. నువ్వు అందులో ఉండు. ఒక తాటితో ఆ నావను నా ముక్కున గ

కొమ్ముకు కట్టు. నేను ప్రళయం అయ్యేవరకు ఆ నావను సముద్రంలో తిప్పుతూ ఈ సృష్టిని రక్షిస్తాను.

సత్యవ్రతుడు భగవానుని స్తుతించి ఆ చేపను పెద్ద సరస్సులో వేశాడు. అది సరస్సు పట్టనంతగా పెరిగిపోయింది. మరొక సరస్సులో వేశాడు. అక్కడా అది పెరిగింది. ఇలా ఆ చేప విశ్వాకారం ధరించింది.

తర్వాత ఆ మహావిష్ణువు చెప్పినట్లు ప్రళయం వచ్చింది. సత్యవ్రతుడు ధాన్యాల్ని సేకరించాడు. సప్తఋషుల్ని ఆహ్వానించాడు. ఇంతలో ఆ ప్రళయ జలంలో పెద్ద నావ వచ్చింది. ఋషులు దానిలో ఎక్కారు. సత్యవ్రతుడు ధాన్యాలను దానిలో భద్రపరచి తానూ పడవ ఎక్కాడు.

మరుక్షణంలో మత్స్యమూర్తి ప్రత్యక్షం అయ్యాడు. ఆ చేప ముక్కున గల కొమ్ముకు సత్యవ్రతుడు పడవ త్రాడును కట్టాడు. మత్స్యరూపంలో వున్న శ్రీమహావిష్ణువు ఆ పడవను ప్రళయ జలరాశిలో త్రిప్పుతూ నడిపాడు.

ప్రళయం అంతం అయింది. కొత్త కల్పం వచ్చింది. ఆ పడవలో మిగిల్చిన ధాన్యముతో సృష్టి జరిగింది. అయితే బ్రహ్మ బ్రహ్మ వేదాలు మాత్రం హయగ్రీవుని దగ్గరే వున్నాయి. అప్పుడు మత్స్యమూర్తి ఆ రాక్షసుణ్ని చంపి వేదాలు తెచ్చి బ్రహ్మకు యిచ్చాడు. బ్రహ్మ ఆ వేదానుశాసనాన్ని అనుసరించి సృష్టి కొనసాగించాడు.

ఈ విధంగా శ్రీహరి మత్స్యావతారం యెత్తి లోకోపకారం చేసిన యీ కథ చదివిన వారికి పోయిన వస్తువులు తిరిగి లభించి, శుభాలు కలుగుతాయని అంటారు.

ఇక్కడితో చతుర్థ పంచమ షష్ఠ సప్తమ అష్టమస్కంధాలలోని కథలు సంగ్రహంగా పూర్తయ్యాయి.

తొమ్మిదవ స్కంధంలో వైవస్వత మనువంశ విస్తరణ, చ్యవనుడికథ ఇక్ష్వాకు, త్రిశంకు, హరిచంద్రుల కథలు యయాతి గాథ, పురు, భరత, వంశాల వివరం మొదలయినవి వర్ణితమైనాయి. యీ స్కంధంలోని అంబరీషుని కథ యిప్పుడు చెప్పుకొందాం.

# అంబరీషుడు

ఎన్నో వేల సంవత్సరాలనాటిమాట. అంబరీషుడు అనే చక్రవర్తి ప్రపంచాన్ని పరిపాలిస్తున్నాడు. ఆయన మహావిష్ణుభక్తుడు. నిరంతరం శ్రీ సేవిస్తూ ప్రజారంజకంగా పరిపాలన చేస్తున్నాడు. ఆయన భక్తికి మెచ్చి మూర్తి అంబరీషునకు సుదర్శన చక్రాన్ని ఇచ్చాడు.

అది అంబరీషుణ్ని ఆయన రాజ్యాన్ని, ఎప్పుడూ రక్షిస్తూండేది. ఒక అంబరీషుడు కార్తికమాసంలో ఏకాదశీవ్రతం చేశాడు. ద్వాదశినాడు పూజచేశ ఆ రోజున దుర్వాసుడు ఆతిథ్యానికి వస్తానన్నాడు. అంబరీషుడు సాదర అంగీకరించాడు.

దుర్వాసుడు సంధ్యావిధి నిర్వర్తించడానికై నదికి వెళ్ళాడు. సేపటికి రాలేదు. ద్వాదశి ఘడియలు వెళ్ళకుండా భోజనం చేయాలి. దుర్వా రాకుండా యెలా భోజనం చేయగలడు.

అంబరీషునకు ధర్మ మీమాంస యెదురయింది. అప్పుడు బ్రహ శ్రేష్ఠులను సంప్రదించగా వారిలా అన్నారు.

"అంబరీషా! ద్వాదశి గడియలు ముగియకుండా ప్రసాదం స్వీకరిం అలా అని అతిధి రాకుండా ఆహారం స్వీకరించరాదు. ఇటువంటి పరిస్థితిలో త్రాగవచ్చు.

ధర్మశాస్త్రాన్ని అనుసరించి అంబరీషుడు మూడు ఉద్ధరిణల తీర్థం సేవించాడు. ద్వాదశివిధిని నిర్వర్తించినట్లు భావించాడు.

ఇంతలో దుర్వాసుడు వచ్చాడు. తాను రాకుండా అంబరీషుడు ద్వా భోజనం చేశాడని భ్రమపడి తెలుసుకోకుండానే అతడిపై కోపగించాడు. దు సుని కోపాగ్ని నుండి 'కృత్య' అనే శక్తి ఆవిర్భవించింది. అది భయంకర అరిచి అంబరీషునిపై పడి చంపాలని ముందుకు వచ్చింది.

అయితే అంబరీషుణ్ని నిరంతరం కాపాడుతుండే సుదర్శన చ రివ్వున వచ్చి ఆ శక్తిని చంపి, భస్మంచేసి దుర్వాసుని వైపు వెళ్ళింది.

తనను చంపాలని సుదర్శన చక్రం వేగంగా రావడం చూసి దుర్వాసుడు భయంతో పారిపోయాడు. అయినా ఆ చక్రం విడువక వెంబడించింది. ఆ ఋషి మేరుపర్వత గుహలో దాక్కొన్నాడు. అయినా సుదర్శన చక్రం విడిచిపెట్టలేదు. దుర్వాసుడు సముద్రంలో దాగాడు. సుదర్శనం వెంబడించింది. అతడు



దుర్వాస అంబరీషులు

బ్రహ్మలోకం వెళ్ళాడు. కైలాసం వెళ్ళాడు. ఎవరూ రక్షించలేమన్నారు.

దుర్వాసుడు ప్రాణాలు అరచేత పెట్టుకొని వైకుంఠం వెళ్ళి విష్ణుమూర్తిని శరణు కోరాడు. విష్ణుమూర్తి తాను కూడా ఏమీ చేయలేనన్నాడు.

అప్పుడు దుర్వాసుడు పశ్చాత్తాప పడ్డాడు. మహాభక్తుడైన అం
షుణ్ని శరణు వేడాడు. తనకు ప్రాణభిక్ష పెట్టమని వేడుకొన్నాడు. అంబరీష
దుర్వాసునికి అభయం యిచ్చాడు.

సుదర్శన చక్రాన్ని శాంతించమని ప్రార్థించాడు. అది శాంతించి,
తిరిగి మాయమయింది. దుర్వాసుడు అంబరీషుని ఆశీర్వదించి వెళ్ళాడు. అం
షుడు అచంచలమైన విష్ణుభక్తితో చిరకీర్తిని పొందాడు.

అంబరీషుని యితిహాస పఠనం సకల శత్రువినాశకరం అని భక్త
భావం.

## పరశురాముడు

యుగయుగాల నాటి సంగతి. హైహయ దేశానికి చక్రవర్తి కా
వీర్యార్జునుడు. అతని రాజధాని పేరు మాహిష్మతీనగరం. కార్తవీర్యార్జును
మహాబలవంతుడు. వేయి చేతులవాడు. అతడు దత్తాత్రేయుని వరంవల్ల మ
వీరుడయ్యాడు.

ఒకనాడు రేవా నదిలో అతడు తన అంతఃపుర పరివారంతో జల
లాడుతున్నాడు. వేయిచేతులు జలానికి అడ్డురావడంతో నది దిగువకు నీరు ప్ర
హించడం ఆగిపోయింది.

నది దిగువ ప్రదేశంలో ఒక చోట అదే సమయంలో రావణుడ
సంధ్యావందనం చేసుకుంటున్నాడు. నదిలో నీటి ప్రవాహం ఆగిపోవడంతో
అతడు ఆగ్రహించి అటుఇటు చూశాడు. అల్లంత దూరాన కార్తవీర్యుడు కనిపి
చాడు. రావణునకు పరిస్థితి అర్థం అయింది.

వెంటనే కార్తవీర్యునిపై విరుచుకొని పడినాడు. ఇద్దరికీ యుద్ధం జ
గింది. కార్తవీర్యార్జునుని పరాక్రమం ముందు రావణుడు నిలువలేకపోయినాడు.
అతనికి బందీ అయినాడు.

మాహిష్మతీ నగరంలో కార్తవీర్యుని సైనికులు రావణాసురుణ్ని

"పది తలల పురుగు" అని గేలిచేసి, ఆడుకొని, విసిరి వేశారు. రావణుడు చావు తప్పి కన్ను లొట్టపోయినట్లు ప్రాణాలు దక్కించుకొని లంకా నగరం చేరాడు.

ఇటువంటి బలపరాక్రమాలుగల కార్తవీర్యార్జునుడు ఒకనాడు అడవికి



పరుశురామ పరాక్రమం

వేటకై వెళ్ళాడు. బాగా అలసిపోయాడు. దగ్గరలోని జమదగ్ని ఆశ్రమానికి వెళ్ళాడు.

ఆ మహర్షి చక్రవర్తికి అన్ని మర్యాదలు చేశాడు. ఆయనకు ఆ

సైన్యానికి షడ్రసోపేతమైన విందు ఇచ్చాడు. కార్తవీర్యార్జునుడు ఎంతో సంతోషించాడు. ఇంతటి గొప్ప విందు ఎలా యివ్వగలిగావని అడిగాడు. అప్పుడు జమదగ్ని తన దగ్గర 'కామధేనువు' వున్నదనీ, అది ఎప్పుడు ఏమి అడిగినా యిస్తుందనీ చెప్పాడు.

ఆ ఆవును తనకు ఇమ్మని కార్తవీర్యుడు జమదగ్నిని అడిగాడు. ఆయన నిరాకరించాడు. అయినా వినక చక్రవర్తి కామధేనువును బలవంతంగా తీసుకొని రాజధానికి వెళ్ళిపోయాడు.

జమదగ్ని కొడుకు పరశురాముడు. అతడు విష్ణుమూర్తి అంశంవల్ల జన్మించిన మహాపరాక్రమశాలి. కార్తవీర్యార్జునుడు ఆశ్రమానికి వచ్చినప్పుడు పరశురాముడు ఆశ్రమంలో లేడు. ఆశ్రమానికి వచ్చి కార్తవీర్యుడు కామధేనువును అపహరించుకొని పోయాడని విని పరశురాముడు కోపగించాడు.

తన దివ్యాయుధం అయిన గండ్రగొడ్డలిని చేతపట్టుకొని మాహిష్మతీ నగరానికి వెళ్ళాడు కార్తవీర్యునిపై యుద్ధం ప్రకటించాడు. ఇద్దరికీ భయంకరంగా పోరు సాగింది. పరశురాముడు గండ్రగొడ్డలితో కార్తవీర్యార్జునుడి వెయ్యి చేతులను నరికి పోగులు పెట్టాడు తలనునరికి దిగ్విజయంగాఆశ్రమానికివచ్చాడు.

ఆ తర్వాత కార్తవీర్యుని కొడుకులు ఒకసారి జమదగ్ని ఆశ్రమంపై దండెత్తి వచ్చారు. ఆ సమయంలో పరశురాముడు ఆశ్రమంలో లేడు పైగా జమదగ్ని తపో సమాధిలో ఉన్నాడు. అప్పుడు వారు జమదగ్నిని చంపి మాహిష్మతికి వెళ్ళిపోయారు.

పరశురాముడు తిరిగి వచ్చి తండ్రి మరణించి ఉండడం చూశాడు. కార్తవీర్యుని కొడుకులు ఈ హత్య చేశారని తెలుసుకొన్నాడు. వెంటనే మాహిష్మతికి వెళ్ళి కార్తవీర్యార్జుని కొడుకుల్ని చంపాడు.

రాజవంశాలపై కత్తిగట్టి ఇరవై ఒక్కమారులు దుష్టులైన రాజుల్ని చంపాడు. శమంత పంచక క్షేత్రంలో ఆ రాజుల రక్తంతో తొమ్మిది మడుగులు నిర్మించాడు. తన తండ్రి తలను శరీరానికి అతికించి బ్రతికించాడు. సరస్వతీనదిలో స్నానంచేసి తపస్సుకు వెళ్ళిపోయాడు.

కాలాంతరంలో శ్రీమహావిష్ణువు రాముడుగా అవతరించినప్పుడు ఈ పరశురాముడే వైష్ణవచాపాన్ని అతడికిచ్చి తన అవతారాన్ని ముగించాడు. పరశురాముని పవిత్రకథ సకల ఫలప్రదాయిని అని పెద్దలంటారు!

## శ్రీరాముడు

ఇరవై నాలుగవ మహాయుగంలో త్రేతా ద్వాపరయుగ సంధి కాలం అది. శ్రీమహావిష్ణువు దశరథుని యింట రాముడుగా అవతరించాడు. విశ్వామిత్రుని యాగాన్ని రక్షించాడు. సీతను వివాహం చేసుకున్నాడు. తండ్రి ఆజ్ఞను అనుసరించి అరణ్యవాసం చేశాడు, దుష్టరాక్షసులు ఎందరినో చంపాడు.

సుగ్రీవునితో మైత్రి చేశాడు. రావణాసురుడు సీతను అపహరించుకొని పోగా లంకపై దండెత్తి రావణుని చంపి, సీత చెర విడిపించాడు. విభీషణుణ్ణి లంకకు చక్రవర్తిగా అభిషేకించాడు.

అయోధ్యకు తిరిగివచ్చి పట్టాభిషిక్తుడై ప్రజారంజకంగా పరిపాలన చేశాడు. రాముడు కథను రామాయణంగా వాల్మీకి వ్రాశాడు. (మా బాలానంద బొమ్మల రామాయణంలో రామకథ విడిగా చదవండి)

అక్కడితో తొమ్మిది స్కంధాలు పూర్తి అయ్యాయి. పదవ స్కంధంలో కృష్ణుడి కథ.

## కృష్ణుడి కథ

కాలచక్రం గిరగిర తిరిగింది. ఇరవై యెనిమిదవ మహాయుగంలో ద్వాపర, కలియుగ సంధికాలం వచ్చింది. అప్పుడు యెందరో దుష్టులు సజ్జనుల హింసించారు. వారినే యక్షసులనేవారు. అటువంటి వారిలో కంసు ఒకడు. అతడు యెన్నో దుష్కృత్యాలు చేశాడు. కంసునితో సహా ఎంద



రావణ సంహారం

రాక్షసుల్ని చంపి లోకకళ్యాణం చేశాడు శ్రీహరి. అందుచే కృష్ణావతారం ఎత్తాడు. కృష్ణావతారం విశేషాలతో భాగవతం దశమస్కంధం సాగుతోంది. ఆ వివరం స్థూలంగా చెప్పుకొందాం.



కారాగారంలో దేవకీ—వసుదేవులు.

యాదవుల రాజ్యానికి ముఖ్యపట్టణం మధురానగరం. యాదవుల మహారాజు శూరసేనుడు. అతని కుమారుడు వసుదేవుడు. అతడి భార్య దేవకి. ఆమెకు పెత్తండ్రి కొడుకు కంసుడు. ఆ రకంగా వారిరువురు అన్నా చెల్లెళ్ళ వరస.

దేవకిని వసుదేవునకిచ్చి వివాహం చేశారు. వారిరువురిని రథంపై

కూర్చుండబెట్టుకొని కంసుడు మధురానగరానికి బయలుదేరాడు. రథం సాఫీ
సాగిపోతోంది.

## కంసుడి దౌష్ట్యం

రథం వేగంగా నడుస్తోంది. ఇంతలో కంసునికి ఆకాశవాణి వి
పించింది.

"కంసా! దేవకీ వసుదేవుల్ని ఇంత ఆదరంగా తీసుకొని వెడు
న్నావు. కానీవారి గర్భవాసాన జన్మించే ఎనిమిదవ కొడుకు నిన్ను సంహరిస్తాడు

ఆకాశవాణి పలుకులకు కంసుడు మొదట ఆశ్చర్యపడ్డాడు. తర్వా
భయపడ్డాడు. ఆపైన అతనిలో కోపం తల యెత్తింది. అంతవరకు చెల్లెలిపైగ
ప్రేమాదరాలు పగగా మారాయి.

రథం ఆపాడు. దేవకిని చంపబోయాడు. అప్పుడు వసుదేవుడు యిల
ప్రార్థించాడు.

"కంసా! నువ్వు చక్రవర్తివి. స్త్రీని సంహరించడం నీకు తగదు
అందులో కొత్తగా వివాహం అయిన చెల్లెల్ని చంపడం నీకు మంచి పని కాదు
మా పిల్లల్ని నీకు అప్పగిస్తాం ఆ పిల్లల్ని చంపు నీకే ప్రమాదం ఉండదు."

వసుదేవుని మాటలు కంసుడికి కొంతవరకు ఉపశమనం కలిగించాయి
చెల్లెల్ని చంపానన్న అపకీర్తి రారాదని భావించి వారిని విడిచిపెట్టాడు.

తర్వాత యాదవరాజ్యాన్ని జయించి తన చెప్పుచేతులలో వుంచు
కొన్నాడు. వారిపై అత్యాచారాలు చేశాడు. ఈలోగా అతనికి ఒక సంగతి
తెలిసింది.

దేవతలు అనేక రూపాలలో యాదవ వంశంలో జన్మిస్తున్నారు.
వారందరు కంసుని రాజ్యాన్ని జయిస్తారు. కంసుని సంహరించడానికి శ్రీహరి
అవతారం ఎత్తాడు.

దీనితో ఆగ్రహించిన కంసుడు దేవకీ, వసుదేవుల్ని కారాగారంలో
బంధించాడు. ఇదివరకు విడిచిపెట్టిన పిల్లల్ని వధించాడు. యాదవ వంశంలో

జన్మించిన మగపిల్లల్ని చంపడం పనిగా పెట్టుకొన్నాడు. కంసుని దౌష్ట్యాన్ని మందలించిన తండ్రి ఉగ్రసేనుణ్ని కూడా అతడు కారాగారంలో బంధించాడు. కంసుని పరిపాలనలో ప్రజలు పడుతున్న కష్టాలకు మితిలేకుండా పోయింది.



శ్రీ కృ ష్ణ జ న నం

## దేవకి పొత్తిళ్ళలో దేవదేవుడు

ప్రపంచంలో పాపం పెరిగినప్పుడు, దుష్టులు విజృంభించినప్పుడు శ్రీమహావిష్ణువు అవతరిస్తాడు. అది సంప్రదాయం. ఆ సమయం రానేవచ్చింది

కంసుని దురాగతాలు మితిమీరినాయి. దేవతలూ, సాధువులూ శ్రీహరిని ప్రా
చారు. ఆయన వారికి అభయం ఇచ్చాడు.

ఆదిశేషుని అంశ భూలోకానికి అవతరించింది. వసుదేవుని మరి
భార్య అయిన రోహిణి యందు బలరాముడుగా జన్మించాడు.

దేవకి మరల గర్భం ధరించింది అది ఎనిమిదవ గర్భం. ఆ గర్భ
జన్మించే శిశువే తనకు మృత్యువు అవుతాడని కంసుడు అక్కడ గట్టి కాప
ఏర్పరిచాడు. దేవకికి నెలలు నిండాయి. ఒకనాటి రాత్రి గ్రహాలు, నక్షత్రా
ఉచ్చస్థితిలో ఉండగా దేవకి ప్రసవించింది. ఆమెకు విష్ణుమూర్తి శిశువుగా జన్మి
చాడు. అన్నీ శుభశకునాలే ఆ సమయంలో కనిపించాయి.

దైవమాయవల్ల అంతవరకు మెలకువగా వున్న కాపలాదారులు నిద్ర
పోయారు. మేఘాలు కమ్ముకు వచ్చాయి. వాన కురవసాగింది.

దేవకి తన కుమారుణ్ణి అక్కున చేర్చుకొని ముద్దాడింది. దివ్యకాం
లీనుతున్న ఆ బాలుణ్ణి కంసుని బారి నుంచి కాపాడాలని భావించింది. భర్త
సంప్రదించింది. వసుదేవుడు బాలుణ్ణి చిన్న బుట్టలో పెట్టుకొని వ్రేపల్లె వై
బయలుదేరాడు. దైవలీలవల్ల బైట తలుపులు తెరుచుకున్నాయి. ఎటువం
విఘ్నాలు లేకుండా అతడు యమునా నదిని చేరాడు. వర్షం పెరిగింది. అయి
శ్రీహరి వస్తున్నాడని యమున దారి యిచ్చింది. బుట్టలోని పసికందుకు వర్షబా
లేకుండా ఆదిశేషుడు పడగపట్టాడు.

వసుదేవుడు వ్రేపల్లె చేరాడు. నందుని ఇంటికి వెళ్ళాడు. నందు
భార్య యశోద. ఆమె ఆడ శిశువుని కనివుంది. వసుదేవుడు నందునితో మాట్లాడి
తన బిడ్డను వారి దగ్గర వుంచి, యశోద కనిన ఆడపిల్లను తీసుకొని వేగంగా
కారాగారానికి తిరిగి వచ్చేశాడు.

దేవబాలుడు వెళ్ళిపోయి మాయాబాలిక లోనికి రావడంతోనే కాపలా
దారులకు మెలకువ వచ్చింది. ఆ పాప కూడా కేరుకేరున ఏడవసాగింది. కంసు
నికి కబురు వెళ్ళింది.

ఆ ఎనిమిదవ శిశువును సంహరించాలని కంసుడు కత్తి చేతబట్టి కారాగారానికి వచ్చాడు. ఆడశిశువు అని తెలిసింది. అయినాసరే అష్టమ గర్భాన పుట్టినవారు తనకు గండం అని భావించి చంపాలని నిశ్చయించాడు.



నదిని దాటుతున్న వసుదేవుడు

శిశువును పైకి విసిరాడు. ఇంతలో ఆకాశవాణి వినిపించింది. పైకి చూశాడు. అక్కడ శిశువులేదు. శక్తిరూపం వుంది. కంసుని ఆశ్చర్యానికి అంతం లేదు. అతనిని భయవిభ్రాంతం చేస్తూ ఆ మాయాశక్తి ఇలా అంది.

"కంసా! నేను కాలశక్తిని. నిన్ను చంపే బాలుడు వ్రేపల్లెలో వున్నాడు. నీకు ఆయువు మూడింది."

ఈమాటలని శక్తి మాయం అయింది. కంసునికి భయం, కోపం ఆశ్చర్యం ముప్పిరి గొన్నాయి. తన ప్రాణం తీసే మగశిశువు వ్రేపల్లెలో ఉన్నాడని తెలుసుకొని కంసుడు మండిపడ్డాడు.

ఆ బాలకుడి ఆచూకీ తీయమని తన అనుచరులైన రాక్షసుల్ని వ్రేపల్లెకు పంపారు. వారు మారువేషాలు వేసుకుని రేపల్లెలో తిరుగుతున్నారు.

## పూతన

అలా మారువేషాలలో వ్రేపల్లెలో తిరుగుతున్న రాక్షసులలో పూతన మాయాశక్తులుగల రాక్షస స్త్రీ. ఆమె అందమైన స్త్రీ వేషం వేసుకొని వ్రేపల్లె వీధులలో తిరుగుతూ ఉంటి పిల్లలకు పాలివ్వసాగింది.

అప్పటికి పాకడం నేర్చిన బాలకృష్ణుడు కూడా ఆమె దగ్గర పాలు త్రాగాలని వచ్చాడు. అప్పుడు పూతన తన శాంబరీ విద్య ద్వారా ఆ బాలుడే శ్రీహరి అని, కంసుని చంపడానికై దేవకి కొడుకుగా అవతరించాడని గుర్తించింది.

వెంటనే తన స్థనాలకు విషం రాసుకొంది. బాలకృష్ణుణ్ని ఎత్తుకొని ముద్దాడింది. పైటతీసి పాలు అందించింది. కృష్ణుడు ఆమె చనులకు రాసుకొన్న విషం ఆరగించుకొన్నాడు. పాలు జీర్ణం చేసుకొన్నాడు. ఆమె నెత్తురు పీల్చి చంపాడు.

అంతవరకు అందమైన స్త్రీగా వున్న ఆమె ప్రాణాలు విడుస్తూ అసలు రాక్షసిగా మారిపోయింది. కృష్ణుడు మహారాక్షసిని చంపాడన్నవార్త వ్రేపల్లెలో వ్యాపించింది.

అలాగే శకటాసురుడనే రాక్షసుడు కృష్ణుని చంపాలని బండివేషం వేసుకొని రాగా, బాలకృష్ణుడు వాడిని తన్ని చంపాడు.

## సుడిగాలిలో రాక్షసులు

బాలకృష్ణుడ్ని యెలాగయినా చంపాలని కంసుడు పంపిన రాక్షసులు ప్రయిత్నాలు చేస్తునేవున్నారు. అటువంటి వారిలో తృణావర్తుడు అనే రాక్షసుడొకడు. ఒకనాడు కృష్ణుడు తోటిపిల్లలతో ఆటలాడు కొంటున్నాడు. అన్ని ఆటలలో అతడిదే పైచేయి. అందరూ ఆటలలో లీనమైవున్నారు.



పూతన సంహారం

ఇంతలో పెద్దగాలి వచ్చింది. పిల్లలు భయపడి అటుఇటు చెదిరిపోయారు. కృష్ణుడు మాత్రం ధైర్యంగా నిలబడి ఆ పెనుగాలిని చూడసాగాడు.

పెనుగాలి సుడిగాలిగా మారింది. బాలకృష్ణుణ్ని గిరగిర తిప్పి ఆ గాలి అ
పైకి ఎగరవేసుకొని పోయింది.

బాలకృష్ణుడు మొదట గింగురులు తిరిగాడు. అంతలోనే అది రా
మాయ అని గుర్తించాడు. ఆ సుడిగాలి మధ్య దాగి తనను ఎగరవేసు



తృణావర్తుని కథ

పోతున్న రాక్షసుణ్ని పసిగట్టాడు. వెంటనే పిడికిలి బిగించి రాక్షసుణ్ని స
చిల్లైలా గుద్దాడు. అంతేకాదు తన బలాన్ని పెంచాడు. బాలకృష్ణుడి దెబ్బ
అతడి బరువుకు రాక్షసుడు తట్టుకోలేక పోయాడు. నెత్తురు కక్కుతూ నే

వాలిపోసాగాడు. కృష్ణుడు ఆ రాక్షసుడి చెవి మెలిపెడుతూ క్రిందకు దిగాడు. కృష్ణుడి దెబ్బలకు ఆ రాక్షసుడు మరణించాడు. వాడెవరో కాదు తృణావర్తుడు బాలకృష్ణుని సాహసాన్ని వ్రేపల్లెలో అందరూ పొగిడారు.

# నల్లదొంగ

నీలమేఘచ్ఛాయతో, అందర్నీ ఆకర్షించే బాలకృష్ణుడు ఎన్నో చిలిపి పనులు చేసేవాడు. గోశాలలో ప్రవేశించి ఆవులపాలు త్రాగి, వెళ్ళిపోయేముందు దూడల్ని వదలి పరుగుపెట్టేవాడు. పొగరుమోతు పోట్లగిత్తల తోకలకు తాటా కులుకట్టి వాటిని బెదరగొట్టేవాడు.

ఆ వీధి ఈ వీధి తిరిగి ఉట్లపై పాలు, పెరుగు త్రాగేసి, స్నేహితులకు పంచిపెట్టేవాడు. వెన్నతినేసి, నిద్రపోయిన ఆయా ఇళ్ళలోని కోడళ్ళ మూతులకు రాసి పారిపోయేవాడు. దానితో అత్తాకోడళ్ళ జగడాలు రగిలేవి. దూరంగా వుండి వినోదం చూసేవాడు.

ఇలా వ్రేపల్లెలో ప్రతి యిల్లూ కృష్ణుని దొంగపనులతో గగ్గులెత్తు తోంది. అతడి ఆగడాలు భరించలేక గోపకాంతలు యశోదకు ఫిర్యాదు చేశారు. "నల్లదొంగ" అని కృష్ణుణ్ణి ఆడిపోశారు. తమ బ్రతుకుల్ని బజారు పాలు చేస్తున్నాడని, కట్టడి చేయమని యశోదకు మొరపెట్టారు. ఆమెకు కోపం వచ్చింది.

# కృష్ణయ్య నోటిలో మూడు లోకాలు

గోపకాంతలు చాడీలు చెప్పి వెళ్ళిన కొంతసేపటికి నల్లదొంగ కృష్ణయ్య ఇంటికి వచ్చాడు. అతడినోటినిండా మన్నువుంది. బలరామన్న తల్లికి తమ్ముడు మన్ను తిన్నాడని చెప్పాడు. యశోద బాలకృష్ణయ్యను పట్టుకొని నోరు తెరిచి చూపమంది. కృష్ణుడు అమాయకంగా నోరు తెరిచాడు.

యశోద ఆశ్చర్యానికి అంతం లేదు. అతడి నోటిలో మూడు లోకాలు,

సృష్టి స్థితి లయలు కనిపించాయి. అగ్ని, వాయువు, సూర్య చంద్రాది గ్రహా
కోటానుకోట్ల జీవరాశి కనిపించాయి. ఆమె భ్రమ తొలగింది! చేయెత్తి దండ
పెట్టబోయి బాలకృష్ణుణ్ని ఆశీర్వదించి అక్కున చేర్చుకుంది.



దొరికిపోయిన వెన్నదొంగ

బాలకృష్ణుడు పకపకా నవ్వాడు. అంతలోనే యశోదకు స్పృహ
వచ్చింది. తన కృష్ణుణ్ని అందరూ "నల్లదొంగ, వెన్నదొంగ" అని తిట్టడ
చెవులలో మారుమ్రోగింది. వెంటనే ఆయమ్మ కృష్ణయ్యను గట్టిగా పట్టుకొంది

# మొలత్రాడుకు రోజు

బాలకృష్ణుడి వెండి మొలత్రాడుకు రోలు ఒకదానిని కట్టింది. అలాచేస్తే ఆ బాలుడు యిల్లు విడిచి ఎటూ పోడని యశోద ఆలోచన.

బాలకృష్ణుడు కాసేపు ఆ రోటిని అటూ యిటూ దొర్లిస్తూ తిరిగాడు. వారి



గంధర్వుల శాప విమోచనం

యింటి పెరడులో రెండు మద్ది చెట్లున్నాయి. కృష్ణుడు రోలును లాగుతూ అట
వైపు వెళ్ళాడు. అతడు చెట్లమధ్య నుంచి ఆ వైపు ప్రాకాడు. కాని రోలు చె
సందున యిరుక్కుపోయింది

కృష్ణుడు బలంగా రోటిని లాగాడు. ఆ కుదుపునకు ఆ చెట్లు రెండు నేలపడ్డాయి. ఆ చెట్లనుంచి గంధర్వులు వచ్చారు. వారు కుబేరుని పుత్రులు. పేర్లు నలకూబరుడు, మణిగ్రీవుడు. శాపంవల్ల అలా చెట్లయి నూరేళ్ళుగా దైవ ధ్యానం చేస్తున్నారు.

కృష్ణుని స్పర్శవల్ల వారికి శాపవిమోచనం కలిగింది. వారిరువు లీలామానుష వేషధారి అయిన శ్రీహరికి నమస్కరించి మాయం అయ్యారు.

దూరానవుండి యీ దృశ్యం చూసిన నందుడు, యశోద కృష్ణ మహిమ తెలుసుకొన్నారు. జనోద్ధరణకై జన్మించిన ఆ శిశువుకు వ్రేపల్లె రక్షణ ఉండదని వారిరువురు భావించారు. అక్కడ నుంచి బృందావనం వెళ్ళిపో లని నిశ్చయించుకొన్నారు. గోపకులుగూడ అంగీకరించారు. తను మధ్య మనుష్య రూపంలో మసులుతున్న శ్రీహరిని తీసుకుని నందుడు, యశోద, గోప ప్రముఖు వ్రేపల్లె వదిలి బృందావనం వెళ్ళిపోయారు.

## బృందావనంలో

యమునా తీరాన బృందావనం వుంది. అది చాలా అందమైన ప్రదేశ యమునానది వడిగల ఇసుక తిన్నెలు వెండిరంగులో మెరుస్తుంటాయి. అక్క పూ వనాలు, సెలయేళ్ళు. చిన్న చిన్న కొండలు బాలకృష్ణుని విహార భూమ లయ్యాయి. అక్కడ గోపీ గోపకులు బలరామ, కృష్ణులకు చక్కటి స్నేహి లయ్యారు.

ఒకసారి వారంతా అక్కడ ఆటపాటలలో వుండగా ఒక అందమై దూడ అటుగా వచ్చింది. గొల్లపిల్లలు దానితో ఆడసాగారు. ఇంతలో కృష్ణు అటువైపు వచ్చాడు. ఆ దూడ మామూలు దూడకాదని, అది రాక్షసుడని అత కనిపెట్టాడు. వెంటనే ఒక్కదూకు దూకి ఆ దూడ కాళ్ళు పట్టుకొని గిరగిరతిప్పి నేలకు వేసి బాది చంపాడు. ప్రాణాలు విడుస్తున్న సమయంలో ఆ దూడ పె రాక్షసుడిగా మారిపోయింది. ఆ రాక్షసుని పేరు వత్సాసురుడు. వాడు కంసు స్నేహితుడు. కృష్ణుని చంపాలనివచ్చి తానే చనిపోయాడు. ఈ సంగతిని బృం

వనంలో అందరు నింతగా చెప్పుకొన్నారు. నందుడు యశోద ఆనందించారు. కాని వ్రేపల్లెలో వలెనే బృందావనానికి కూడా కృష్ణుని శత్రువులు వస్తున్నారని ఆలోచించి వారు బాధపడ్డారు.



వత్సాసుర సంహారం

## మరో ఇద్దరికి శాస్తి

కొంతకాలం గడిచింది. కృష్ణుడు బలరామాదులు వెంటరాగా బృందావనంలోని ఒక సెలయేటివద్ద ఆటలాడుకొంటున్నాడు. ఇంతలో అక్కడ

పెద్దకొంగ వచ్చి వాలింది. దానికి పొడవైన కాళ్ళున్నాయి. కొనతేలిన ముక్కుంది. పెద్ద నోరుంది. హోరుగాలి వీచగల రెక్కలున్నాయి.

అది అదను చూసి కృష్ణునిపై దూకింది. అతన్ని గుటుక్కున



బకాసురిడి వధ

మింగింగి. కానీ కృష్ణుడు దాని గొంతుకు అడ్డుపడ్డాడు. అది విల విల లాడింది. గాలి ఆడక పోవడంతో కృష్ణుణ్ని బయటకు కక్కింది. కృష్ణుడప్పుడు ఆ కొంగ

నోటిని పట్టుకొని రెండుగా చీల్చాడు. అది నెత్తురు కక్కుకొంటూ చచ్చిపోయి రాక్షసుడుగా మారింది. వాడి పేరు బకాసురుడు. వీడుకూడా కంసుని శిష్యుడే. కృష్ణున్ని తినబోయి అతడి చేతిలో చచ్చాడు.

అలాగే మరొకసారి బకాసురుని తమ్ముడు అఘాసురుడు కొండచిలువ



అఘాసురుని అంతం

రూపంలో వచ్చాడు. గోపకుల్ని మ్రింగాడు. కృష్ణుణ్నికూడా మ్రింగాడు. అయితే కృష్ణుడు చాకచక్యంగా దానికి ఊపిరి ఆడకుండా చేసి చంపాడు. ఆ తర్వాత దాని పొట్ట చీల్చాడు, గోపకులందరూ బ్రతికి బయటపడ్డారు. ఇలా బకాసురుడు

అఘాసురుడు అనే యిద్దరు యుష్కరులకు కృష్ణుడు శాస్తి చేయడమే కాక వారిని చంపాడు. అప్పటికి బాలకృష్ణుని వయసు ఐదేళ్ళు.

## కాళీయ మర్దనం

బృందావనంలో ఒకచోట కాళిందీ అనే సరస్సు వుంది. అందులో కాళీయుడు అనే రాక్షసరాజు తన భార్యలతో కాపురం వుంటున్నాడు. అతడు వెళ్ళక్కక్కిన విషం వలన ఆ నీరు విషపూరితం అయింది. దానిని ఎవరు తాగినా మరణిస్తారు. అలా యెన్నో పశువులు, ఎందరో మనుష్యులు విధిలేక ఆ నీరు త్రాగి చనిపోయారు.

ఒకనాడు కృష్ణుడూ స్నేహితులూ ఆ సరస్సు దగ్గర ఆటలకు వెళ్ళారు. అందరూ బాగా అలసిపోయేలా ఆడారు. చివరకు గోపకులు కాళిందీ మడుగులో దిగారు. స్నానాలు చేశారు. ఆ నీటిని త్రాగారు, మరుక్షణంలో చచ్చిపోయారు.

ఈ విపరీతం చూసిన కృష్ణుడు కోపగించి తానుకూడా మడుగులో ఉరికి కాళీయుని పడగలపై తాండవం చేశాడు. అతడి భార్యలు శరణువేడారు. వానిపై కృష్ణుడు శాంతించి యిలా అన్నాడు.

"మానవులు, పశువులు సంచరించే ఈ ప్రాంతం నుంచి వెళ్ళిపొండి. ఈ సరస్సులో యికనుంచి అమృతజలాలు ప్రసరిస్తాయి."

కృష్ణుని ఆజ్ఞానుసారం కాళీయుడు భార్యలతో అక్కడి నుండి వెళ్ళి పోయాడు. నాటినుంచి కాళింది మడుగు అమృతజలాలతో ప్రవహించింది. కృష్ణుని మహిమను అందరూ కీర్తించారు.

## మునికాంతల మురిపెం

బృందావన సమీపంలోనే మునిపల్లెలున్నాయి. వాటికి, బృందావనానికి మధ్యఅడవి వుంది. కృష్ణుడు ఒకసారి ఆ అడవిలో ఆడుకునేందుకు స్నేహితులతో వచ్చాడు. అందరు ఆడుకొన్నారు. వారందరికి బాగా ఆకలివేసింది. అప్పుడు

కృష్ణుడు కొందరు గోపబాలుల్ని దగ్గరలోని ముని ఆశ్రమాలకు వెళ్ళి వారి నడి తినడానికి ఏమైనా తీసుకురమ్మని పంపాడు.

ఆ బాలకులు వెళ్ళి మునుల్ని ఆహారం యిమ్మని అడిగారు. వారు వీరి వీరి గురువైన కృష్ణుడి మాటల్ని లక్ష్యపెట్టలేదు. ఏవీ ఇవ్వలేదు. విచారంగా తిరిగి వచ్చిన గోపబాలురతో కృష్ణుడు ఇలా అన్నాడు.

"మీరు వెళ్ళి నా మాటలను చెప్పి మునికాంతల నడిగి ఆహారం తీసుకో రండి."

కృష్ణుని సలహా ప్రకారం గోపపిల్లలు మునిపల్లె కుమరల వెళ్ళారు. రహస్యంగా ఇళ్ళలో దూరబడ్డారు. మునికాంతలకు కృష్ణుని సందేశం వినిపించారు.

వారు ఆప్యాయంగా పిండివంటలు, ఊరగాయలు, భోజన ఫలహారాలు తీసుకొని శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చారు. అతనితో బాటు అందరికీ విందు చేశారు. బాలగోపాలుని మాటలు విని మురిసిపోయారు. శ్రీహరి మనుష్యావతారం యెత్తి లోకోద్ధరణకు ఉపక్రమిస్తున్నాడని తెలిసి, మునికాంతలు ఆ దేవదేవునకు ప్రణమిల్లారు.

## ఇంద్రుని ఆగ్రహం

యాదవుల కులదైవం ఇంద్రుడు. అతడు వర్షాధిపతి. పశుపోషణ, వ్యవసాయం జీవనోపాధిగా వున్న యాదవులు ఇంద్రుణ్ని ఆరాధిస్తారు. తమ ఆరాధనకు సంతోషించి, ఇంద్రుడు సకాలంలో వర్షం కురిపించి, పాడిపంటలు వృద్ధికావడానికి సహకరిస్తాడని వారి ఆశ. అందుకే ప్రతియేట ఇంద్రయాగం పేరిట ఇంద్రుని పూజించే ఆచారం వచ్చింది. ఆ యేడాది కూడా ఇంద్రయాగం చేద్దామని గోపకులు అనగా, కృష్ణుడు ఇలా అన్నాడు.

"పాలిచ్చేవి పశువులు, వాటిని ఆరాధించండి. పంటనిచ్చేది భూదేవి. ఆ తల్లిని కొలవండి. కొండవల్ల శీతల వాయువులు ఏర్పడి మబ్బులు వర్షిస్తాయి. కనుక కొండని పూజించండి, వర్ష ఋతువులో వాన కురిపించడం ఇంద్రుని బాధ్యత. ఈసారి మీరు ఇంద్రయాగం చేయవద్దు. ఈ ప్రకృతిమాతనే సేవించండి."

కృష్ణుని మాటలను అందరూ ఆమోదించారు. అతడు చెప్పిన ప్రకారం కొండకు, పశుసంతతికి, ప్రకృతికి పూజచేసి సమారాధనం చేశారు.

ఇది తెలిసి ఇంద్రుడు కోపగించాడు వెంటనే రాళ్ళవాన కురిపించాడు.



గోవర్ధనగిరివద్ద గోపబాలుడు

గోకులం కకావికలమయింది. వెను వెంటనే ప్రళయ సదృశంగా పెనువాన కురిపించాడు. గోపాలురు తల్లడిల్లారు. బృందావనం గగ్గోలు ఎత్తింది. అందరూ కృష్ణుడిని ప్రార్థించారు. అప్పుడు నందనందనుడు వారికి ఉపాయం చెప్పాడు

"మీరంతా గోవర్ధన పర్వతం దగ్గరకు పదండి. నేను ఆ పర్వతాన్ని ఎత్తి మీకు ఈ పెను వృష్టి నుంచి రక్షణ కల్పిస్తాను."

కృష్ణుని మాటపై విలువ ఉంచి గోపాలురు తమ గోగణాలతో గోవర్ధనగిరిని చేరారు. కృష్ణుడు ఆ పర్వతాన్ని చిటికెన వ్రేలితో పైకెత్తాడు. దాని క్రింద గోపాలురు. వారి సంసారాలు, పశుసంతతి రక్షణ పొందారు.

అయినా ఇంద్రుడు శాంతించలేదు. ఏడుపగుళ్ళు ఏడు రాత్రులు శిలా వర్షం, జలవృష్టి సాగిస్తూనే వున్నాడు! కృష్ణుడు గోవర్ధన గిరిని ఎత్తే ఉంచాడు. వర్షదేవత తన శక్తియుక్తులు ఉడిగిపోవడంతో శాంతించింది. రాళ్ళవాన నిలిచిపోయింది.

కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని క్రిందకు దింపుతుండగా గోపాలురు బయటకు వచ్చారు. ఆ రక్షణపరాయణుడయిన కృష్ణుని అనేక విధాలుగా కీర్తించారు.

ఇంద్రుడు సిగ్గుపడి వచ్చి కృష్ణుని అభినందించాడు. ఐరావతంచేత తామరపూల పూజ చేయించాడు. కామధేనువు ఇచ్చిన పాలతో ఆయనను సేవించాడు. కృష్ణుడు. అవతార పురుషుడని భావించి, నమస్కరించి. దేవలోకానికి వెళ్ళిపోయాడు. ఈకథ సమస్త విఘ్నాలు రూపుమాపి అభీష్టాలు నెరవేరుస్తుందని అంటారు.

# వేణుగానం

కృష్ణుడు మురళి చక్కగా వాయించేవాడు. అతడి వేణుగానానికి ఈ ప్రకృతి పులకించేది. పశువులు తన్మయమై వినేవి. ఆవులు క్షీరధారలు స్రవించేవి. కొండలు గొంతెత్తి ఆ ధ్వనిని మరల ప్రతిధ్వనించేవి. సర్పాలు చేష్టలుడిగేవి, పూలు వికశించేవి. మొక్కలు వింతకాంతులు వెదజల్లేవి. నదులు సంగీత ధ్వనులతో ప్రవహించేవి.

ఇక బృందావనంలోని గోపికలు కృష్ణుని వేణుగానం విని సర్వం

మరిచిపోయేవారు. ఇళ్ళు వదలి వచ్చేవారు. సంసారబంధాలు త్రెంచుకొని ఆ వేణుగాన లోలునితో ఆటలాడేవారు. పాటలు పాడేవారు. అదంతా సృష్టి వైచిత్రం. అదంతా ప్రకృతి పులకింత. అదంతా ప్రకృతి పురుషుల రాసక్రీడ. అదే విచిత్ర దైవలీల.



వేణుగానంలో వేదసారం

ఈ ప్రపంచం, ఈ జీవరాశి, ఈ విశాల విశ్వం అంతా కృష్ణమయం. అంతా దేవమాయ అని చాటిచెప్పిన సామగాన రసమిది. అంతా కృష్ణమయం

ఇలా బృందావనంలో రాసలీలలు ప్రదర్శించిన కృష్ణుడు ఒకసారి

గోపాలుర్ని తనని, చంపాలని వచ్చిన శంఖచూడుడు అనే రాక్షసుడ్ని చంపాడు అలాగే వృషభాసురుడ్ని చంపాడు.

దుష్టుల్ని శిక్షిస్తూ, శిష్టుల్ని రక్షిస్తూ కృష్ణుడు యిలా చిన్ననాడే తన అవతార వైభవాన్ని ప్రదర్శించసాగాడు. కాలం గడుస్తోంది.

# కంసుని పన్నాగం

బాలకృష్ణుని పరాక్రమ లీలలు, తాను నియమించిన రాక్షసుల చావులు కంసునిలో ప్రాణభయాన్ని, అంతకుమించి బలరామకృష్ణుల పట్ల కోపాన్ని పగను రగిల్చాయి. వారిని యెలాగైనా చంపాలని ఉపాయం ఆలోచించాడు. పన్నాగం పన్నాడు.

మధురానగరంలో ధనుర్యాగం చేయునున్నట్లు ప్రకటించాడు. బలపరాక్రమాలు ప్రదర్శించే అందరికీ మధురానగరంలో పోటీలుంటాయి. ఎవరయినా పాల్గొనవచ్చు.

బృందావనానికి మాత్రం అక్రూరుణ్ని రాయబారిగా పంపాడు. బలరామకృష్ణుల్ని ఆహ్వానించమని చెప్పాడు.అక్రూరుడు బృందావనానికి వెళ్ళాడు.

బలరామకృష్ణుల్ని చూశాడు. వారు సాక్షాత్తూ శ్రీహరి అవతారం అని గుర్తించాడు. సాగిలపడి నమస్కరించాడు. పురుషసూక్తంతో స్తుతించాడు. తను వచ్చిన పని వారికి చెప్పాడు.

మధురానగరం వచ్చి శిష్టరక్షణ దుష్టశిక్షణ చేయమని అక్రూరుని సందేశం విన్నారు. బలరామకృష్ణులు ధనుర్యాగానికి వస్తామన్నారు. అక్రూరుడు మధురకు వెళ్ళిపోయాడు.

# ధనుర్యాగం

రాచవంశాల వీరులు తమ పరాక్రమాన్ని, యుద్ధ విద్యానైపుణ్యాన్ని ప్రదర్శించడానికి "ధనుర్యాగం" వంటి ఉత్సవాలు నిర్వహించడం ఆనాడు

పరిపాటి. దీనివల్ల రెండు ప్రయోజనాలున్నాయి. యువకులలో యుద్ధవిద్యల పట్ల పోటీని పెంపొందించటం మొదటి ప్రయోజనం కాగా, తమ శత్రువుల్ని పరోక్షంగా చంపించడానికి ఒక వేదికగా ఇది ఉపకరిస్తుంది. ఇది రెండవ ప్రయోజనం. బలరామకృష్ణుల్ని చంపాలన్న దురుద్దేశ్యంతోనే కంసుడు యీ ధనుర్యాగం తల పెట్టాడు.

దేశదేశాల వీరులతో మధురానగరం కళకళలాడుతోంది. బలరామకృష్ణులు రాచవీధులు తిరుగుతున్నారు. దారిలో వారికి ఒక చాకలి కనిపించాడు. వాడి దగ్గర మంచి రాచదుస్తులున్నాయి. కృష్ణుడు వాణ్ని పిలిచి తమకు మంచి బట్టలు ఇమ్మన్నాడు. అప్పుడు ఆ చాకలి వారిని వేళాకోళంచేసి "అల్లరి పనులు, దొంగవేషాలు వేసే గోపాలకులకు రాచదుస్తులా" అని పకపక నవ్వాడు. వాడి మాటలు విని అక్కడి జనం కూడా బలరామకృష్ణుల్నిచూసి వేళాకోళంగా నవ్వి అవమాన పరిచారు.

అప్పుడు కృష్ణుడు ఆ చాకలిపైకి లంఘించి, బలంగా కొట్టి చంపాడు. వాడు నిజం చాకలికాడు. బలరామకృష్ణుల్ని పరాభవించి చంపాలని వచ్చిన రాక్షసుడు. అయితే ఆటసాగలేదు సరికదా ఆయువు మూడి చచ్చిపోయాడు. వాడి వెంటఉన్న చాకళ్ళు మాత్రం ఆ బాలలిద్దరికీ నమస్కరించి వారికి పట్టుధట్టీలు చీనిచీనాంబరాలు కానుకగా ఇచ్చి వెళ్ళారు.

## నిన్న కుజ - నేడు సుందరి

బలరామకృష్ణులు నగరం తిరుగుతూ మరొకవీధిలోనికి వచ్చారు. అది పూలబజారు. అక్కడ మూడు వంకరలు తిరిగిన శరీరంతో అందవికారంగా వున్న కుబ్జ అనే యువతి రకరకాల పూలను విక్రయిస్తున్నది. ఆ యువతి పూలమాలల కట్టడంలో చాలా నేర్పరి. ముడుచుకొనే దండలు, విచ్చుకునే దండలు, ఆకారాల మార్చుకొనే మాలలు ఇలా ఆమె అనేక రకాల దండలు కట్టగలదు. పూలను అందంగా అమర్చగలదు పైగా పునుగు, జవ్వాది వంటి పరిమళద్రవ్యాలు కూడా అమ్ముతుంటుంది.

ఆమె బలరామకృష్ణులకు చక్కటి మాలలు ఇచ్చింది. పూలు ఇచ్చింది. పునుగు జవ్వాది పులిమింది. వారిని అప్యాయంగా చూసింది. ఆమె భక్తికి మెచ్చి కృష్ణుడు ఆమె శరీరాన్ని నిమిరాడు అంతవరకు కుబ్జ రూపంలో అందవికారంగా



కుబ్జపై కృపాదృష్టి

వున్న ఆమె కృష్ణ స్పర్శతో అందమైన యువతిగా మారింది. పరమేశ్వరుని కృప వల్ల నిన్నటి కుబ్జ నేటి సుందరి అయింది.

# కువలయా పీడం

ఆ అన్నదమ్ము లిద్దరు రాజవీధులు నడిచి, నడిచి, రాచసౌధం దగ్గరకు చేరారు. అక్కడే ధనుర్యాగం జరుగుతున్నది. వారు లోపలకు వెళ్ళిపోయారు. అయితే సింహద్వారం దగ్గర వారిపైకి ఏనుగు ఒకటి దూకింది. దాని పేరు



చాణూరునితో మల్లయుద్ధం

కువలయాపీడం. అది చాలా బలమైనది. పొగరు గలది. అది బలరామకృష్ణుల్ని తొండంతో పట్టుకొని తామరకాడ వలె నేలకు వేసి కొట్టి చంపాలని ప్రయత్నించింది కాని వారిద్దరు ఎంతో నేర్పుగా తప్పించుకుని దాని కుంభస్థలం పైకి ఎక్కారు.

ఇద్దరు అటుఇటు చేరి, దాని కుంభస్థలాన్ని బలంగా మర్దించి చంపారు. ఆ మదపుటేనుగు హాహాకారం చెస్తూ నెత్తురు కారుస్తూ నేలకూ ప్రాణాలు విడిచింది. ఆ ఏనుగు దంతాలనుకోసి బలరామకృష్ణులు భుజాన వేసుకొ రాజభవన ప్రాంగణంలో ప్రవేశించారు.

# మల్లయుద్ధం

అక్కడ మల్ల యుద్ధం జరుగుతోంది ఎందరో మల్ల యుద్ధవీరులు దానిల పాల్గొంటున్నారు. వారందరిని కంసుని ఆస్థాన మల్ల యోధులు చాణూర ముష్టికు ఓడించాడు. అప్పుడు బలరామకృష్ణులు వారిపైకి దూకారు. చిత్ర విచిత్రగతులల వారు నలుగురు ముష్టియుద్ధం చేస్తున్నారు.

పర్వతంపై పిడుగువలె ఏనుగుల కుంభస్థలలాపై వజ్రఘాతంవలె, రా స్తంభాలపై కుంభవృష్టివలె చాణూర ముష్టికులను బలరామకృష్ణులు బాధించారు చివరకు ఆ మల్ల యోధులిద్దరి శక్తి సన్నగిల్లి వారిచేతులలో మరణించారు.

ఎందరో మల్ల యోధుల్ని అవలీలగా చంపిన చాణూరముష్టికుల్ని చంపి బలరామకృష్ణుల్ని చూసి ప్రజలు జయజయధ్వానాలు చేశారు. దుష్టులైన ఆ ఇద్ద మృతికి వారానందించారు.

# కంసవధ

బలరామకృష్ణ విజయగాధ విన్న కంసుడు మండిపడ్డాడు. వారిపై కోపంతో విరుచుకు పడ్డాడు. వసుదేవుణ్ని ఉగ్రసేనుణ్ని నందాదుల్ని చిత్ర హింసలు పెట్టమని భటులకు ఆజ్ఞలు జారీచేసాడు. వారు వెళ్ళబోయారు. అయి బలరాముడు విజృంభించి అడ్డగించాడు.

కంసుడిని ఉపేక్షించి లాభంలేదని కృష్ణుడు అతడిపై లంఘించాడు ఇద్దరు హోరాహోరి పోరాడారు. కృష్ణుడు కంసుణ్ని సంహరించాడు. ఈ ఘోర చూసిన కంసుని సోదరులు అతడిపై విరుచుకు పడ్డారు, కృష్ణుడు వారిని కూడ చంపాడు.

కంసుని చెరలో వున్న తల్లి దండ్రులు దేవకి వసుదేవుల్ని, తాత ఉగ్ర సేనుణ్ని ఇంకా ఎందరో రాజుల్ని విడిపించారు. బలరామకృష్ణుల విజయగాథను కిన్నెర, కింపురుషాదులు కీర్తించారు. కంసుని మరణంతో దేవతలానందించారు. భూమండలంపై పుష్పవృష్టి కురిసింది.



కంసవధ

## సాందీపని

ఆ కాలంలో ఉజ్జయినిలో సాందీపని అనే మహర్షి ఉండేవాడు. ఆయన ఉత్తమగురువు. ఎందరో శిష్యుల్ని తయారు చేసిన కులపతి. ఆయన దగ్గర చద

రామ కృష్ణులు ఆశ్రమవాసంచేసి సకల విద్యా రహస్యాలు నేర్చారు. వేదాంతం తెలుసుకొన్నారు. రాజనీతి అభ్యసించారు. దర్శనశాస్త్రాలు వల్లె వేశారు. ఆ ఉత్తమ గురువు దగ్గర ఉత్తమ శిష్యులుగా రూపొందారు.

ఒకనాడు ఆయనకు గురుదక్షిణ ఇస్తామన్నారు. తన కుమారుడు



తల్లిదండ్రులకు విముక్తి

సముద్రంలో పడి చనిపోయాడని, అతడిని తీసుకువచ్చి ఇమ్మని సాందీపని కోరాడు.

గురువు అభీష్టాన్ని అనుసరించి బలరామకృష్ణులు సముద్రం అంతా

వెదికారు. ఆ బాలుడు యమలోకంలో ఉన్నాడని వారికి చివరకు తెలిసింది. వారిద్దరు యమధర్మరాజు దగ్గరకు వెళ్ళారు. సంగతి వివరించారు. యమధర్మరాజు ఆ బాలుడిని వారికి అప్పగించి, సాదరంగా పంపించాడు. బలరామకృష్ణులు



సాందీపని విద్యాశిక్షణ

భూలోకానికివచ్చి, గురుదక్షిణ చెల్లించి, ఆయన ఆశీస్సులు పొంది మధురానగరానికి తిరిగి వచ్చారు.

## జరాసంధ పరాభవం

ఆ రోజులలో మగధదేశాన్ని జరాసంధుడు పరిపాలిస్తున్నాడు. కంసుడు అతడికి అల్లుడు అవుతాడు. కృష్ణుడు తన అల్లుడ్ని చంపాడన్న కోపంతో జరాసంధుడు దండెత్తి వచ్చాడు. ఇరవై మూడు అక్షౌహిణుల సైన్యంతో జరాసంధుడు విరుచుకుపడగా బలరాముడు అడ్డుకొన్నాడు. తన నాగలితో శత్రు సైన్యాల్ని వధించాడు. రోకలితో మర్దించాడు. ఆ సేనలు పలాయనం చిత్తగించాయి.

బలరాముడు విజృంభించి జరాసంధుని రథాన్ని విరగగొట్టాడు. అతడిని పట్టుకొని బంధించాడు. అతన్ని చంపాలనుకొన్నాడు. కాని "జరాసంధుణ్ణి అప్పుడే చంపవలదని" కృష్ణుడు చెప్పగా బలరాముడు వదిలిపెట్టాడు. పరాభవంతో జరాసంధుడు మగధకు వెళ్ళిపోయాడు. జరాసంధ పరాభవ వార్త మధురా నగర ప్రజల్ని ఆనంద పరవశుల్ని చేసింది.

ఆ తర్వాత రైవతుడనే రాజు తన కుమార్తె రేవతిని బలరామునకు యిచ్చి వివాహం చేశాడు. బలరామ కథ సకల శ్రేయోదాయకం అని పెద్దల మాట.

## రుక్మిణీ కళ్యాణం

విదర్భ దేశాధిపతి భీష్మక మహారాజు. ఆయనకు రుక్మి, రుక్మి రథ, రుక్మబాహు, రుక్మకేశి, రుక్మమాల అనే అయిదుగురు కొడుకులు, రుక్మిణీ అనే కూతురు ఉన్నారు.

రుక్మిణీ సౌందర్యవంతురాలు సుగుణశీలి. ఆమె కృష్ణుని బలరామ పరాక్రమాలు, గుణగణాలు విని, అతడిని ప్రేమించింది. ఆమెకు యుక్తవయస్సు వచ్చింది. తండ్రి వివాహ ప్రయత్నాలు ప్రారంభించాడు. ఆమె అన్న రుక్మికి ఆమెను స్నేహితుడైన శిశుపాలునకు ఇచ్చి వివాహం చేయాలని ఉంది. శిశుపాలుని పట్ల రుక్మిణికి ఆసక్తి లేదు.

అందుకని ఆమె తమ కుల బ్రాహ్మణుడయిన అగ్నిద్యోతనుని ద్వారా కృష్ణునికి రాయబారం పంపింది.

వివాహానికి ముందు గౌరీ పూజకై నగరం పొలిమేరలలోని దేవి ఆలయా
స్థానని, అక్కడ నుంచి తనను తీసుకొని వెళ్ళి రాక్షసపద్ధతిన వివాహం
ామని రుక్మిణి పంపిన సందేశాన్ని ఆ విప్రుడు కృష్ణునకు వినిపించాడు.
డు అభయం ఇచ్చాడు.



రుక్మిణి హరణం

పెళ్ళిరోజు రానే వచ్చింది. విదర్భరాచనగరం కల కలలాడుతోంది. శిశు
ాదులు తరలి వచ్చారు. కృష్ణుని జాడ మాత్రం కానరాలేదు.

అయినా రుక్మిణి అధైర్యపడక మనస్సులో కృష్ణున్నే ధ్యానిస్తూ గుడికి

బయలుదేరి వెళ్ళింది. అక్కడ గౌరీపూజ పూర్తిచేసింది. తిరిగివస్తుండగా మార్గంలో కృష్ణుడు రథంపై వచ్చి ఆమెను రథం ఎక్కించుకొని తీసుకు వెళ్ళాడు.

ఈ వార్త తెలిసిన రుక్మి మండిపడ్డాడు. శిశుపాలుడు వెంటరాగా కృష్ణుని అడ్డగించి పోరాడాడు. కృష్ణుడు వారందరినీ ఓడించి అవమానించి పంపాడు.

ద్వారక చేరి రుక్మిణిని విధ్యుక్తంగా వివాహం చేసుకొన్నాడు. వారికి ప్రద్యుమ్నుడు అనే కుమారుడు జన్మించాడు. రుక్మిణీ పరిణయగాథ ఇష్ట వాంఛా ఫలాన్ని యిస్తుందంటారు.

## సత్యభామ

ద్వారకాదేశాన్ని సత్రాజిత్తు అనే రాజు పరిపాలించేవాడు. ఆయన కుమార్తె సత్యభామ అపురూప సౌందర్యవతి, నెరజాణ. సత్రాజిత్తు సూర్యుణ్ణి ఆరాధించి శమంతక మణిని సంపాదించాడు. అది రోజూ నూరు బారువుల బంగారం యిస్తుంది.

ఒకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనజిత్తు ఆ మణిని ధరించి వేటకు వెళ్ళాడు. అతడిని సింహం చంపింది. అయితే మణిని మాత్రం జాంబవంతుడు తీసుకొని వెళ్ళిపోయి తన కుమార్తె జాంబవతికి బహూకరించాడు.

అంతకుముందు ఒకసారి కృష్ణుడు ఆ మణిని తనకిమ్మని సత్రాజిత్తుని అడిగాడు. ఆయన ఇవ్వలేదు. అయితే ఇప్పుడు ఆ మణిని కృష్ణుడే అపహరించాడని సత్రాజిత్తు నింద వేశాడు.

ఆ నింద మాపుకొనాలని కృష్ణుడు బయలుదేరాడు. ప్రసేనజిత్తుని సింహం చంపిన చోటునుంచి అడుగు జాడలు గుర్తించి జాంబవంతుని గుహచేరాడు. అక్కడ జాంబవతి దగ్గర శమంతకమణి కనిపించింది. తీసుకొనబోయాడు.

ఇంతలో జాంబవంతుడు వచ్చి కృష్ణునిపై పడ్డాడు. ఇద్దరు భయంకరంగా

యుద్ధం చేశారు. చివరకు జాంబవంతుడు ఓడిపోయాడు కృష్ణుడు శ్రీమహావిష్ణువు అవతారం అని గుర్తించి జాంబవంతుడు అతడికి నమస్కరించి, తన కుమార్తె అయిన జాంబవతిని ఇచ్చి పెళ్ళి చేశాడు. శమంతకమణిని కానుకగా ఇచ్చాడు.

కృష్ణుడు శమంతక మణిని సత్రాజిత్తుకు ఇచ్చి తన నింద మాపు కొన్నాడు. సత్రాజిత్తు తన తొందరపాటుకు చింతించి, సత్యభామను యిచ్చి



జాంబవంతునితో కృష్ణుని యుద్ధం

కృష్ణునితో వివాహం చేశాడు. శ్యమంతకమణిని ఆ నూతన దంపతులకు బహూకరించాడు.

# నరకాసుర సంహారం

నరకాసురుడు ప్రాగ్జ్యోతిషపుర ప్రభువు. అతడికే భౌమాసురుడు అ
పేరుంది. ఈ నగరం అటు బ్రహ్మదేశానికి అటు హస్తినాపురానికి మధ్యన ఉంది



నరకాసుర సంహారం

ప్రస్తుతం అస్సాం అని మనం పిలుస్తున్న ప్రాంతం ఆనాడు ఆ పేరుతో పిలః
బడేది. నరకాసురుడు అటు సత్రాజిత్తుకు, ఇటు పాండవులకు, కృష్ణునక
విరోధి. పైగా రాక్షసుడు.

అతడి దుష్కృత్యాలకు అంతేలేదు. ఎందరినో అతడు దారుణంగా చంపాడు. పదహారు వేలమంది రాచకన్యలను కారాగారంలో బంధించాడు. వారందరు కృష్ణుని ధ్యానిస్తూ తమకు విముక్తి కలిగించమని తపస్సు చేస్తున్నారు.

ఒకసారి కృష్ణుడు సత్యభామతో కలిసి నరకునిపై దండెత్తాడు. భయంకరంగా యుద్ధం జరిగింది. కృష్ణుడు మూర్ఛపోయాడు. అప్పుడు కొంత సేపు సత్యభామ యుద్ధం చేసింది. ఇంతలో కృష్ణునికు స్పృహ వచ్చింది. చక్రం ప్రయోగించి నరకుడి శిరస్సు ఖండించాడు.

లోకం హర్షించింది. పదహారు వేల మంది రాచకన్యలను కృష్ణుడు చెర విడిపించాడు. వారి కోరిక మేరకు వారందరినీ ఆయన వివాహం చేసుకొన్నాడు. కృష్ణునకు ఎనిమిది మంది పట్టమహిషులు, పదహారు వేలమంది రాణులు ఉండే వారు. నరకాసుర సంహార గాథ సకల విఘ్నవినాశకరం అని పెద్దలమాట.

## ఉష-అనిరుద్ధుడు

బలిచక్రవర్తికి నూరుగురు కొడుకులు. వారిలో పెద్దవాడు బాణాసురుడు, అతడు పరమ శివభక్తుడు పైగా మహాబలవంతుడు. భుజపరాక్రమశాలి. తన బాహుబలంపై ఎంతో గర్వం ఉన్నవాడు. అతని కుమార్తె ఉష.

ఆమె కృష్ణ నందనుడైన అనిరుద్ధుణ్ని కలలో చూసి ప్రేమించింది. తన చెలికత్తెద్వారా అతడి వివరాలు తెలుసుకొంది. ఆ అందగాడినే వివాహం చేసుకొనాలని నిర్ణయించుకొంది. చెలికత్తెను పంపి నిద్రిస్తున్న అనిరుద్ధుణ్ని మాయం చేసి తీసుకొని రమ్మంది. ఆ చెలికత్తె అలాగే చేసింది.

ఉష అనిరుద్ధులు ప్రేమ సామ్రాజ్యంలో విహరించారు. ఉష గర్భవతి అయింది. ఇది తెలిసిన బాణాసురుడు మండిపడ్డాడు. అనిరుద్ధుణ్ని నాగపాశంతో బంధించాడు. దీనితో ఉషా కన్య శోకించింది.

ఎన్నాళ్ళకు అనిరుద్ధుని జాడ తెలియక పోవడంతో కృష్ణాదులు కంగారి పడ్డారు. నారదుడు వారికి అనిరుద్ధుడు బంది అయిన సంగతి చెప్పాడు.

అప్పుడు కృష్ణుడు యాదవసైన్యంతో బాణాసురునిపై దండెత్తాడు యుద్ధం భయంకరంగా జరిగింది. బాణాసురునికి పరమశివుడు సాయంవచ్చి నిః చాడు. అయినా లక్ష్యపెట్టక కృష్ణుడు సుదర్శనం ప్రయోగించాడు. అది అగ్ని జ్వాలలు వెదజల్లుతూ బాణాసురుడి వేయిచేతుల్ని ఖండించింది. బాణాసురుడు నిర్వీర్యుడయ్యాడు. అప్పుడు ఈశ్వరుడు తన భక్తుడైన బాణుణ్ని విడవమని కృష్ణునకు నచ్చచెప్పాడు. కృష్ణుడు అనుగ్రహించాడు.

అతడు శివభక్తుడైన చిరకీర్తి పొందాడు. ఉషానిరుద్ధులకు వివాహం వైభవంగా జరిగింది. శంకర శ్రీకృష్ణులు ప్రమేయం పెట్టుకొన్న ఈగాథ అన్ని అభీష్టాలు నెరవేరుస్తుందని పెద్దలు అంటారు.

## కృష్ణలీలా వైభవం

అనంతర కాలంలో శ్రీకృష్ణుడు మథుర, ద్వారక, హస్తినాపుర రాజ కీయాలు నిర్వహించాడు. ఎంతో రాజనీతి ప్రదర్శించాడు. ఎందరో దుష్టుల్ని సంహరించాడు. పౌండ్రక కాశీరాజులను ఉద్ధరించాడు. ద్వివిదునికి మోక్షం ప్రసా దించాడు. సాంబునికి వివాహం చేయించాడు. నారదునకు తన దివ్యలీలలు చూపాడు.

పాండవాగ్రజులైన ధర్మరాజుచేత రాజసూయం చేయించాడు. ఆ సమ యంలో జరాసంధుణ్ని వధింపజేసి, అతడికి బందీలైన ఎందరో రాజుల్ని విడిపిం చాడు. అనంతరం భీష్ముడి సలహాను అనుసరించి ధర్మరాజు తనకు అగ్ర

ఎన్నాళ్ళకు అనిరుద్ధుని జాడ తెలియక పోవడంతో కృష్ణాదులు కంగారు పడ్డారు. నారదుడు వారికి అనిరుద్ధుడు బంది అయిన సంగతి చెప్పాడు.

అప్పుడు కృష్ణుడు యాదవసైన్యంతో బాణాసురునిపై దండెత్తాడు. యుద్ధం భయంకరంగా జరిగింది. బాణాసురునికి పరమశివుడు సాయంవచ్చి నిలి చాడు. అయినా లక్ష్యపెట్టక కృష్ణుడు సుదర్శనం ప్రయోగించాడు. అది అగ్ని జ్వాలలు వెదజల్లుతూ బాణాసురుడి వేయిచేతుల్ని ఖండించింది. బాణాసురుడు నిర్వీర్యుడయ్యాడు. అప్పుడు ఈశ్వరుడు తన భక్తుడైన బాణుణ్ని విడవమని కృష్ణునకు నచ్చచెప్పాడు. కృష్ణుడు అనుగ్రహించాడు.

అతడు శివభక్తుడైన చిరకీర్తి పొందాడు. ఉషానిరుద్ధులకు వివాహం వైభవంగా జరిగింది. శంకర శ్రీకృష్ణులు ప్రమేయం పెట్టుకొన్న ఈగాథ అన్ని అభీష్టాలు నెరవేరుస్తుందని పెద్దలు అంటారు.

# కృష్ణలీలా వైభవం

అనంతర కాలంలో శ్రీకృష్ణుడు మధుర, ద్వారక, హస్తినాపుర రాజ కీయాలు నిర్వహించాడు. ఎంతో రాజనీతి ప్రదర్శించాడు. ఎందరో దుష్టుల్ని సంహరించాడు. పౌండ్రక కాశీరాజులను ఉద్ధరించాడు. ద్వివిదునికి మోక్షం ప్రసా దించాడు. సాంబునికి వివాహం చేయించాడు. నారదునకు తన దివ్యలీలలు చూపాడు.

పాండవాగ్రజులైన ధర్మరాజుచేత రాజసూయం చేయించాడు. ఆ సమ యంలో జరాసంధుణ్ని వధింపజేసి, అతడికి బందీలైన ఎందరో రాజుల్ని విడిపిం చాడు. అనంతరం భీష్ముడి సలహాను అనుసరించి ధర్మరాజు తనకు అగ్ర

# మునుల శాపం

శ్రీకృష్ణుడు భారతయుద్ధం చేయించి, దుష్టులయిన రాజుల్ని చంపించాడు. దానితో భూభారం తగ్గింది. మంచివారికి కష్టకాలం పోయింది. కృష్ణుడు ద్వారకానగరం చేరాడు. అక్కడ యాదవ వంశస్థులు బలగర్వితులై సంచరించడం చూశాడు. వారివల్ల భవిష్యత్తులో లోకానికి, సజ్జనులకు అపకారం తప్పదని భావించాడు. వారి అహంకారాన్ని అణచాలని కృష్ణుడు సంకల్పించాడు. సమయం కోసం వేచి ఉన్నాడు.

ఆ సమయం రానే వచ్చింది. ఒకసారి వశిష్ట, విశ్వామిత్ర, దుర్వాస వామ దేవాది మహర్షులు ద్వారకా నగరం వచ్చారు. వారికి ఉగ్రసేన మహారాజు సకల విధ మర్యాదలు చేయించాడు.

నగరం పరిసరాలలోని ఉద్యాన వనంలో వారికి విడిది యేర్పాటు చేయించాడు. ఆ మునులందరూ అక్కడ బసచేసి అనేక రకాలయిన కాలవై పరీత్యాలు గురించి కాల ప్రభావం గురించి చర్చలు జరుపుతూ సద్గోష్టిలో నిమగ్నులైనారు.

బలంతో అధికారంతో గర్వితులైన యాదవులు కొందరు ఋషుల్ని పరిహసించాలని అనుకొన్నారు. సాంబునకు స్త్రీ వేషం వేయించారు. పైగా గర్భవతి అయినట్లు అలంకరించారు. ఋషుల వద్దకు తీసుకువచ్చారు. ఆ ఋషులు వారిని ఆశీర్వదించి సంగతేమిటని ప్రశ్నించారు. అప్పుడు వారిలా అన్నారు.

"మహర్షులారా! ఈ యువతి కిది తొలికాన్పు, ఆడపిల్ల పుడుతుందో? మగపిల్లవాడు పుడతాడో? మీ దివ్యదృష్టితో భవిష్యత్తును చెప్పండి."

వారి మాటలు విని ఋషులు దివ్యదృష్టితో చూశారు. సంగతిని గ్రహిం

ారు. పురుషునకు ఆడవేషం వేయించి తమను వారు పరిహసించారని ఋషులు ప్ర_ర్తించారు. వారిపై ఆగ్రహించి యిలా శపించారు :

"ఓ యాదవులారా! ధన బల గర్వంతో మీరు మునులనే అవమానించారు. గేలిచేశారు. ఈ సాంబుని గర్భాన ఒక ముసలం (రోకలి) పుడుతుంది. అది మీ వంశాన్ని నాశనం చేస్తుంది."

మునులశాపం విని యాదవులు భయపడ్డారు. అంతలోనే ధైర్యం తెచ్చుకొన్నారు. వారు శస్త్ర చికిత్స చేయించి సాంబుని కడుపు కోయించారు. దానిలో ంచగానే యినుప రోకలి కనిపించింది. ఋషుల శాపం వృథా పోలేదని వారు గ్రహించారు. ఆ రోకలి తమను నాశనం చేస్తుందని భయపడ్డారు.

అందరూ కలసి దానిని ఉగ్రసేన మహారాజు దగ్గరకు తీసుకువెళ్ళి ఋషుల శాపం గురించి చెప్పారు. అప్పుడు మహారాజు ఇలా అన్నాడు.

"యాదవులారా! పెద్దలను అవమానించడం ప్రాణాంతకమే. అయినా మనల్ని రక్షించుకోవాలి కనుక యీ రోకలిని అరగదీయండి. ఆ రజనును సముద్రంలో కలపండి."

ఉగ్రసేనుని ఆజ్ఞను అనుసరించి యాదవులు రోకలిని అరగదీసి రజను అంతా సముద్రంలో కలిపారు. చిన్న ముక్క మిగిలితే అది తమనేం చేస్తుందని దానిని సముద్రంలో పారవేశారు. ఆ ఇనుప రజను నుంచి కాలక్రమంలో సాగర తీరాన ఇనుపతుంగ మొలిచింది. ఆ ఇనుపముక్కను చేప మ్రింగింది. ఆ చేపను జాలరి పట్టుకొన్నాడు. దానిని కోయగా ఇనుప ముక్క బయటపడింది. అతను దానిని బాణానికి ములుకుగా అమర్చుకొన్నాడు. వాడి పేరు జర.

కాలచక్రం గిరగిర తిరిగింది. యాదవులలో పరస్పరం కలహాలు పెరి

గాయి. ఒకరంటే మరొకరికి పడడంలేదు. ఒకరినిచూసి మరొకరు ద్వేషించుకొం న్నారు. ఒకరిపై ఒకరు చాడీలు చెప్పుకొంటున్నారు. మనుషుల మధ్య కలహా ఇళ్ళమధ్యకు విస్తరించాయి. ఇంటింటి తగాదాలు వీధులకు యెక్కాయి. వీధి-వీ కయ్యాలు గ్రామం అంతా వ్యాపించాయి. గ్రామాలమధ్య వైరుధ్యాలు వంశా మధ్య పాకాయి. ఇలా యాదవులు ఒకరిపై ఒకరు కత్తులు నూరుతున్నారు. సమయంలో కృష్ణుడు యాదవ ప్రముఖుల్ని పిలిచి ఇలా ఆదేశించాడు.

"యాదవ శ్రేష్ఠులారా! ద్వారకా నగరానికి, గోకులానికి, యాద వంశానికీ చెడుకాలం వచ్చింది. ఇక మీరు ఇక్కడ వుండడం శ్రేయస్కరం కాద అందరూ నావలపై సముద్రం దాటి ప్రభాసక్షేత్రం వెళ్ళండి. చోటు మారితే చి శాంతి సమకూరుతుందేమో! అక్కడయినా మీరు స్నేహంగా, శాంతం జీవించండి."

శ్రీకృష్ణుని ఆదేశం విని యాదవ శ్రేష్టులు నావలపై సాగరం దా ప్రభాసక్షేత్రం చేరారు. అక్కడ వారు "మైరేయం" అనే మద్యం సేవించారు. అ వారి బుద్ధిని హరించివేసింది. వారిలో మరల కలతలు తల ఎత్తాయి. అక్కడ వి పేతంగా పెరిగిన ఇనుప తుంగతో పరస్పరం కొట్టుకొని వారు మరణించారు యాదవ వృష్ణి దశార్హ మొదలైన వంశాలు ఆ అంతఃకలహాలలో అంతరిం పోయాయి. మునుల శాపం వృధా పోలేదు. సాంబుని కడుపున జన్మించిన రోకలి అరగదీయగా వచ్చిన రజను నుంచి పుట్టిన ఇనుపతుంగతో కొట్టుకొని యాదవు నశించారు.

యాదవులు ఇలా చనిపోవడంతో భూమి భారం ఇంకాతగ్గింది. అప్పుడ

బలరాముడు అక్కడికి ఒక చెట్టు క్రింద చేరి ఆత్మను పరమాత్మయందు లగ్నం చేశాడు. యోగమార్గాన ప్రాణాన్ని విడిచాడు.

బలరాముడు వైకుంఠం చేరగానే శ్రీకృష్ణుడు అక్కడి రావిచెట్టు క్రింద విశ్రమించాడు. అతడి అరికాళ్ళు ఎఱ్ఱతామరవలె ప్రకాశిస్తున్నాయి. కృష్ణుని శరీరం దివ్యతేజస్సుతో వెలుగొందుతోంది. అతడి వక్షస్థలంపై శ్రీవత్సం ప్రకాశిస్తోంది.

ఇంతలో అటుగా జర అనే పేరుగల వేటగాడు వచ్చాడు. అతడి దగ్గరే ముసలం ముక్క ములుకుగా తగిలించిన బాణం వుంది. అతడు జంతువుల్ని వేటాడుతూ వచ్చాడు. అతడి బారినుంచి ఒక లేడి తప్పించుకొని అటుగా పరుగెత్తింది. దానిని వెదుకుతూ 'జర' కృష్ణుడు విశ్రమించిన చెట్టువైపు వచ్చాడు. దూరంగా పొంచి పరికించి చూశాడు. అతడికి కృష్ణుని పాదం లేడి ముట్టివలె కనిపించింది. వెంటనే గురిచూసి బాణం వదిలాడు. అది శ్రీకృష్ణుని కాలి నరాన్ని ఛేదించింది. మరుక్షణంలో అక్కడ శ్రీకృష్ణుని రూపం మాయం అయింది, చతుర్భుజాలతో శ్రీమహావిష్ణుమూర్తి రూపం వెలిసింది.

వేటగాడు ఆ దివ్యమంగళ స్వరూపాన్ని చూసి, వేగిరం దగ్గరకు వచ్చి శరణు వేడాడు. అప్పుడు విష్ణుమూర్తి అతనికి అభయం ఇచ్చి ఇలా అన్నాడు

"నాయనా! భయపడకు. ఋషుల శాపం ప్రకారం యాదవకులాన్ని

ముసలం నాశనం చేసింది. నువ్వు బాణం ములుకుగా ఉపయోగించిన ఇనుపముక్క కూడా ఆ ముసలంలో భాగమే. నువ్వు నిమిత్తమాత్రుడవు. నీకు వైకుంఠం ప్రసాదిస్తున్నాను. నా అవతారం పరిసమాప్తం అయ్యింది. కృష్ణావతార రూపపైన



కృష్ణావతారం పరిసమాప్తం

ఈ "హరికథ"ను చదివినా, విన్నా, వ్రాసినా వారికి విఘ్నాలు తొలగిపోయి సుఖాలు, లాభాలు సంప్రాప్తిస్తాయి."

ఈ మాటలు అని శ్రీహరి వైకుంఠం చేరాడు. బోయవాడు శరీరంతో విష్ణు సాయుజ్యం పొందాడు.

ఇలా శ్రీకృష్ణుడు అనేక దివ్యలీలలు ప్రదర్శించి, లోకోపకారం చేసి, దుష్టత్వాన్ని అంతం చేసి, వైకుంఠం చేరాడు. ఈ అవతారంలోనే శిశుపాల దంతవక్త్రుల్ని చంపి, జయవిజయములకు శాపవిమోచనం కలిగించాడు. దశమ, ఏకాదశ స్కంధాల కథను యిలా సంగ్రహంగా చెప్పుకొన్నాం.

# యుగధర్మాలు

భాగవతం పన్నెండవ (ద్వాదశ) స్కంధంలో కలియుగ రాజవంశాలు, యుగధర్మాలు, కల్పాల, ప్రళయాల, పరీక్షిత్తు దేహత్యాగం, జనమేజయుని సర్పయాగం, వేదశాఖల వర్ణన, మార్కండేయ కథ, పురాణాల వివరం వర్ణితమైనాయి.

ఈ మహాలోకాన్ని నాలుగు యుగాలుగా విభజించారు. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం వాటి పేర్లు.

కృతయుగంలో ధర్మానికి సత్యం, దయ, తపస్సు, దానం అనేవి నాలుగు పాదాలు. ఈ యుగంలో మానవజాతి ఈ నాలుగు విశిష్టగుణాలతో విరజిల్లుతుంది.

త్రేతాయుగంలో యించుమించు యీ లక్షణాలే వుంటాయి. కాని మానవులు ధర్మానికి పొరుసు వంటిదయిన అధర్మం గురించి కూడా ఆలోచన చేస్తుంటారు.

ద్వాపరయుగంలో అధర్మం యొక్క ప్రధాన లక్షణాలైన అసత్యం హింస, అసంతోషం అంకురిస్తాయి. ఇవే క్రమంగా పెరుగుతాయి.

కలియుగంలో పూర్తిగా ధర్మం క్షీణిస్తుంది. ఎక్కడ చూసినా అసత్యవాదులుంటారు. హింసాప్రియులు విజృంభిస్తారు. అసంతుష్టి పెరుగుతుంది. కలహప్రియులకు కొదువ ఉండదు.

ఇలా కలియుగం నడిచి, నడిచి, ప్రళయం వస్తుంది. అనంతరం మరల సత్యం (కృత) యుగం వస్తుంది. ఇది చక్ర భ్రమణం ఇది కాలధర్మం. ఈకాల నేమి క్రమానికి సాక్షిభూతుడు శ్రీమన్నారాయణమూర్తి.

ఆయన ప్రళయ సముద్రంపై వటపత్రసాయియై వుంటాడు.

ఆ శిశువు నుంచి మాయారూపమైన ఈ సృష్టిమరల జరుగుతుంది ఆ దివ్యరూపాన్నే మార్కండేయాదులు ఆరాధింపారు.

# కల్కి

కలియుగంలో మానవులు అనేక రకాలయినదుష్టబుద్ధులు గలిగి వుంటారు. ఆచారాలు వుండవు. మంచి, మర్యాదలు వుండవు. అన్న విక్రయం జరుగుతుంది. ఆచార్యులు విద్యను బాహాటంగా అమ్ముతారు. వేదానికి, వేద విద్యలకు ఆదరణ సన్నగిల్లుతుంది. తల్లి దండ్రుల్ని ద్వేషించే పిల్లలు పుడతారు. పిల్లల్ని కబళించే స్త్రీ పురుషులుంటారు. కామమే తప్ప ప్రేమానురాగాలు వుండవు.

అబద్ధాలు యెక్కువగా చెలామణి అవుతాయి. నీతి నియమాలుండవు. ఈర్ష్య అసూయ పెచ్చు పెరుగుతాయి.

ఇటువంటి విలక్షణాలతో కలియుగ మానవులు ఒకరిపై ఒకరు విరుచుకు పడే వికృతి మీరాక శ్రీ మహావిష్ణువు కల్కి అవతారం యెత్తుతాడు. ఆయన సింహళంలోని శంభళ అనే గ్రామంలో విష్ణుయశుడు అనే పేరుగల బ్రాహ్మణుని యింట జన్మిస్తాడు.

దేవతలు ఇచ్చిన మంచి గుర్రాన్ని యెక్కి భూమండలం అంతా తిరుగుతాడు. దుష్టుల్ని, దొంగల్ని, ప్రజల్ని పీడించే ప్రభువుల్ని, పాలకుల్ని చంపుతాడు. శీలాన్ని అమ్ముకొని బ్రతికే స్త్రీలను ఉద్ధరిస్తాడు. సత్యపాలనం చేయిస్తాడు.

దయ, ధర్మ గుణాల్ని ప్రజలలో మేల్కొల్పుతాడు. ప్రజల్ని కంటికి రెప్పవలె కాపాడుతూ పాలించే మంచి పాలకుల్ని ఏర్పరుస్తాడు.

అప్పుడు మరల సత్యయుగం వస్తుంది. సూర్యవంశస్థుడయిన మరుత్తు చంద్ర వంశీయుడైన దేవాపి తపస్సు పూర్తిచేసుకొని, కల్కి పురుషుని ఆజ్ఞను అనుసరించి రాజులవుతారు.

వీరిలో మరుత్తు ఇక్ష్వాకు వంశీయుడు. దేవాపి భీష్ముని తండ్రి శంతనునికి అన్నగారు. ఆనాడు వారు రాజ్యాలు వదిలి తపస్సులకు వెళ్ళిపోయారు. వారు "కలాప" అనే చోట యోగసిద్ధులై వున్నారు.

వారిని కల్కి మేల్కొలిపి కర్తవ్యం ఉపదేశిస్తాడు. అప్పుడు వారు చక్రవర్తులై సత్యయుగాన్ని స్థాపిస్తారు. మానవులు సదాచార సంపన్నులు అవుతారు. సత్యవర్తులవుతారు. అదే కృతయుగం. భూమండలం సస్య సమృద్ధం అవుతుంది.

సకాలంలో వర్షాలు పడతాయి. ఋతువులు సక్రమంగా తిరుగుతుంటాయి. వులు తుష్టి, పుష్టి కలిగి దివ్య తేజస్సుతో ప్రకాశిస్తారు.

కాలపురుషుడు, కాలహంతుకుడు, కాలకర్త అయిన శ్రీహ సంకీర్తనమే ఇహ పరసౌఖ్యాలనిపిస్తుంది. ఇది వ్యాస వచనం. ఇదే భ ఆదేశం. ఇదే భారతీయుల విశ్వాసం.

సర్వం కృష్ణార్పణమస్తు.